

# డబ్బుకు లోకమే దాసోహం!

తృప్తి అంతస్తు ఎక్కడున్నాయి? డబ్బులో వున్నాయి.
గౌరవం హోదా ఎక్కడున్నాయి? డబ్బులో వున్నాయి.
ఆ డబ్బు చుట్టూ యీ ప్రపంచం వుంది.
ఆ డబ్బే నా చేతుల్లో వుంటే యీ ప్రపంచమే
నా చేతుల్లో వుంటుంది.
డబ్బొస్తే..
స్థలాలు, తోటలు, పొలాలు, పాడిపంట ఏవి
కావాలన్నా కొంటాను.
యింకా డబ్బొస్తే...
అంతస్తులపై అంతస్తులు కడతాను.
ఎయిర్ కండిషన్డ్ కార్లలో తిరుగుతాను.
పరువుని, ప్రతిష్ఠను హోదాను గౌరవాన్ని
కొంటాను.
యింకా యింకా డబ్బొస్తే....
ఓట్లు కొంటాను, సీట్లు కొంటాను,
ఊళ్ళు కొంటాను, దేశాన్నే కొంటాను.
యింకా యింకా డబ్బొస్తే.....
ఆ దేవుణ్ణే కొంటాను.

కోటయ్య దేవుణ్ణి కొనగలిగాడా!
తన వద్దకు దించగలిగాడా!!
తన చెప్పు చేతల్లో వుంచగలిగాడా!!!

గీతా ఆర్ట్స్ ప్రొడక్షన్స్

# దేవుడే దిగివస్తే







# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 26–9–'75
రాక్షసనామ సం. భాద్రపదమాస బ. షష్ఠి
సంపుటము : 69 సంచిక : 3

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు. 33–80
ఆరుమాసాల చందా – రు. 16–90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక



# ఉత్తరాలు

### చవితి సంచిక

వారం వారం మీరు అందించిన పత్రిక చాలా బాగుంది. సీరియల్స్‌లో గాజుమేడ సాఫీగా సాగిపోతోంది. ఈ వినాయకచవితి పత్రిక మా ఇంటిల్లిపాదినీ ఆకర్షించింది. ఇహపోతే ప్రతివారం అట్టమీద బొమ్మకంటే కూడా వెనకట్టగుద బొమ్మలే బాగావేస్తున్నారు.

డి. సదానందరావు, డి. కృష్ణవేణి, డి. వి. రమణమూర్తి, డి. పద్మ, డి. లీలాకుమారి.
(రైల్వేకాలనీ, పలాస)

* * *

శ్రీ గోలిశెట్టిగారు వేసిన విఘ్నేశ్వరుని ముఖచిత్రముతో విరాజిల్లిన వినాయకచవితి "పత్రిక" నూతన పోకడలతో మా హస్తగతమైనది. ముఖ్యంగా ఈసారి వేసిన "కార్టూన్లు" అన్ని మమ్ము కడుపుబ్బ నవ్వించాయి. ఈసారి ఈ సంచిక మా ఇంటిల్లిపాదినీ అమితంగా ఆనందింప జేసినది.

—లతీఫొద్దీన్ అహమద్ (సుల్తానాబాద్)

### అట్టమీద బొమ్మ

29—8—75 వాణిశ్రీ ముఖచిత్రంతో వెల్వడిన 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' చూపరులకు ఎంతో శోభనిచ్చింది. ముఖచిత్రం విషయంలో మీరు చూపే శ్రద్ధ చాల ప్రశంసనీయంగా ఉంది. 'గాజుమేడ' సీరియల్ పత్రికకే హైలైట్. కార్టూన్‌లు చాలా బావుంటున్నాయి. 'యువతరం' నీరాజి గారి చిరునామా ఏమిటోమరి ?

వాణిశ్రీ కల్చరల్ అసోసియేషన్, మార్కాపూర్.

* * *

వాణిశ్రీ ముఖచిత్రంతో వెలువడిన 29.8.75 తేది పత్రిక కవర్ నుండి చివరి దాకా ఆకర్షణీయంగా ఉంది. కార్టూన్స్ ఆర్ వెరీ స్పోర్టివ్. రామలక్ష్మి గారి సమాధానాలు 'పొగరు'గా ఉన్నాయి.

అందే వెంకటేశ్వర్లు, (నెల్లూరు.)

* * *

వాణిశ్రీ ముఖచిత్రంతో వెలువడిన మా కుటుంబ సభ్యుల అభిమాన వీక్లీ అయిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ముద్దమందారంలా ముద్దులొలుకుతుంది. 'మీకు తెల్సా' శీర్షిక ద్వారా విచిత్ర విషయాన్ని తెలుసుకున్నాం.

నాళ్ల మనోహర్, నాళ్ల రత్నాకర్, (ఇల్లందు మాణిక్యారాం)

### సీరియల్

"గాజుమేడ" సీరియల్ చాలా బావుంది. "రాగ వీచికలు" ముందు ముందు ఎలా ఉంటుందో కాని ప్రారంభంలోనే న్యూమోడల్‌గా ఉంది.

పి. సీతాదేవి, గిరిజ (ఇల్లందు.)

* * *

# వారఫలం

## 26 9 1975 శుక్రవారం మొదలు 2-10-1975 గురువారం వరకు

**మేషం—:** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో పోటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు. స్త్రీలకు—సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**వృషభం:—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:—** మీ తాలూకు మనుష్యులేమిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

**కర్కాటకం:—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు రాగలవు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులసహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**కన్య :—** అనుకూలమైన వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:—** ఫలితం లేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో రావలసినడబ్బు అందుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — అనవసరమైన వ్యయం జరుగుతుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గలసంభాషణలను జరుపగలరు. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలుబాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులనుకల్సుకొంటారు.

**ధనుస్సు :—** వృత్తిలో పోటివారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. రావలసిన డబ్బు అందుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలుకూడా జారిపోవచ్చును. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మకరం :—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. ప్రయోజనం గలవ్యక్తులనుకల్సుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయంచేస్తారు.

**కుంభం :—** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**మీనం— :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో ఒడుదుడుకులు తగ్గవు. మునుముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. అనుకూలమైన సమాచారం అందుతుంది.

—మహేష్

---

ఈ వారం సీరియల్ "గాజుమేడ"లో ఇప్పటివరకు ఉష, డాక్టర్ ప్రభాకరాన్ని ప్రేమిస్తున్నట్లు ఎక్కడా రాలేదు. అలాగే ప్రభాకరం కూడా ఉషను ప్రేమతో చూస్తున్నట్లు కాని చెప్పడు, ఎక్కడ ఆ విషయం తెలుపడు. అలాంటిది ఈ ఒక్క వారంలోనే ప్రభాకరం ఉషకు తెలియకుండా అక్కడే పడుకోవడం, తరువాత ఆమె జడపట్టుకు లాగిన ఏమీ అనక పోవటం, ఆ తరువాత ఆమె ఏ పరిధిలో ఉన్నదీ కూడా తెలుసుకోకుండా ముందుమేదో జరుగుతుందన్న భయంలో నన్ను పెళ్లి చేసుకుంటావా అని అడగటం అంత బాగులేదు.

ఎ. ప్రకాష్, ఎస్. నర్సింగరావు (సికింద్రాబాద్).

* * *

"గాజు మేడ" సీరియల్ పత్రికకే హైలైట్, 'సమ్మె—సమ్మకహో' శీర్షిక వలన మాకు తెలియని విషయాలెన్నో తెలుసుకొన గలుగుతున్నాము.

కె. పూర్ణచంద్ర, కె. రమేష్, ఎ. శ్రీధర్ (ఎర్రగుంటపల్లి)

### కథలు

29.8.75 సంచికలో ప్రచురించిన "జాతక రహస్యం" సమాజంలో నేటి నగటు మనుషుల జీవితాలకు ప్రతిబింబం. "చెల్లీ! రైలెక్కకమ్మా" సందేశాత్మకమైనదిగా ఉంది.

ఆత్మహీనుడు "గోపీచంద్‌గారి శైలిలో" వ్రాసిన రాజశేఖర్‌గారికి అభినందనలు.

"రాగపిచికలు" రమ్యంగా ఉండి పత్రికకెంతో విశేషంగా ఉంటోంది.

వై. ఆర్. కె. ప్రసాద్ (గుంటూరు)

* * *

మీరు 29—8—75 నాటి పత్రికలో ప్రచురించిన "చెల్లీ రైలెక్కకమ్మా" కథ చాలా బాగుంది. రచయిత్రిగారికి, మీకు మా ధన్యవాదాలు. 'ఆత్మహీనుడు' కథలో రచయిత మనం చేసినంతే మనకు లభిస్తుందనే నీతిని బాగా స్పష్టీకరించారు. 'జాతక రహస్యం' 'మోసరికం' కథలు కూడా బాగున్నాయి.

ఎం. మధురిమ (బనగానపల్లి.)

### హైదరాబాద్ నోట్‌బుక్

29—8—75 సంచికలోని 'హైదరాబాద్ నోట్‌బుక్"లో తిరుమల రామచంద్రగారు అంతరిక్షంలో ఉపాధ్యాయుని గురించి వ్రాస్తూ ఆగస్టు 2వ తేదీ సాయంకాలం ప్రారంభోత్సవం జరిగిందన్నారు. కాని నిజంగా అది ఆగస్టు 1వ తేదీ సాయంకాలం ఆరు గంటల ఇరవై నిమిషాలకు మొదలయింది. ఇంకో విషయమేమిటంటే వారన్నట్లు గ్రామాల సంఖ్య 900 కాదు. 400 మాత్రమే. మరో ఆరు వందల నగరాలలో ఈ ప్రయోగం జరగటం గురించి మేమెక్కడా వినలేదు.

కె. నాగచెంచయ్య పి. రామకృష్ణ టి. తిరుమలరావు, (అహమ్మదాబాదు.)

**క్రమశిక్షణ, సత్ప్రవర్తన దేశ ప్రగతికి ముఖ్యాధారాలు**

### యువతరం

ఆంధ్రపత్రిక వీక్లీలో యువతరం. మినీ ఇంటర్వ్యూ శీర్షికలు అణిముత్యాలని చెప్పవచ్చు. కేవలం ఆ శీర్షికలో విద్యాభ్యాసం చేసే వారివే వేయడం జరుగుతున్నది. ఉన్నత ఆదర్శాలు గల యువకులు విద్యావంతులలోనే వున్నారు. విద్యావంతులు కాని వారిలో కూడ ఉన్నారు. ఈ శీర్షికలలో విద్యాభ్యాసం చేసే వారికే ప్రాముఖ్యత ఇవ్వడం శోచనీయమే అవుతుంది. "మినీఇంటర్వ్యూ" "యువతరం" శీర్షికలలో విద్యాభ్యాసం చెయ్యని యువకులకు కూడా స్థానం కల్పించాలి.

బోనం మోహనరావు, (మిర్యాలగూడ.)



# జీవన సంధ్య

కాకాని కమల

"అమ్మాయి సంధ్యా...సంధ్యా" అంటూ ఉత్సాహంగా తలుపు తట్టాడు రామ్మూర్తి.

కర్టెన్ క్లాత్ మీద పువ్వులు కుడుతున్న సంధ్య, తండ్రి పిలుపు విని చరాలున లేచివచ్చి తలుపుతీసింది.

భర్త కంఠం విన్న సీతమ్మ కూడా వంట గదిలోనుంచి గబగబా హాల్లోకి వచ్చింది.

రామ్మూర్తి భార్యని చూస్తూనే చిరునవ్వులు చిందించి చెప్పులు విడిచి కుర్చీలో కూర్చున్నాడు. పై కండువా తీసి ముఖం తుడుచుకుంటూ "రామ రామ" అనుకున్నాడు తనలో తను. అది కాస్త ఆయనకి ఊతపదం.

'వెళ్ళిన పని అయినట్లుంది" అనుకుంది తృప్తిగా సీతమ్మ భర్త ముఖంలో చిందులు వేస్తున్న ఆనందం చూస్తూ.

"సంధ్యా! నాన్నగారికి కాసిని మంచినీళ్లు తెచ్చియ్యి." అని భర్త కేసి చూస్తూ "ప్రయాణం బాగా జరిగిందా?" అంది.

"ఆఁ ... ఈసారి ప్రయాణం బ్రహ్మాండంగా జరిగింది. రైల్లో కూర్చుందుకే కాదు పడుక్కుందుకు కూడా జాగా దొరికింది" అన్నాడు.

"ఇంకేం !? అందుకేనా ఇంత ఆనందం" అని నవ్వి "ఇంతకీ ఆ వెంకట్రామయ్యగార్ని కలిశారా ?" అన్నది అరాగా.

"నాన్నా ! ఇదిగో" అంటూ కూతురు అందించిన మంచినీళ్లు తాగి "లేదు ..." అన్నాడు తాపీగా రామ్మూర్తి.

తల్లీ కూతుళ్లు ఒకళ్ల మొఖాలు ఒకరు చూసుకున్నారు వింతగా.

"ఏం ? ఆయన వూళ్లోలేడా ?"

"ఏమో ...నాకేం తెల్సు. నేనసలు ఆయన ఇంటి గుమ్మం మెట్లు కూడా ఎక్కలేదు" అన్నాడు రామ్మూర్తి జేబులోంచి చుట్ట తీసి వెలిగిస్తూ.

సీతమ్మకి ఆశ్చర్యంతో క్షణంసేపు నోట మాట రాలేదు.

నేనేకదా భార్యని సస్పెన్సులో పెట్టా నన్న గర్వంతో చుట్ట కాల్చటం మొదలు పెట్టాడు.

"ఏమిటి ? ... పనికట్టుకుని స్కూలుకి సెలవుపెట్టి, డబ్బు కూడేసుకుని ఆయన్ని కలిసి పిల్లకి సంబంధం మాట్లాడి వస్తానని వెళ్లిన పెద్దమనిషి, తీరా ఆవూరు వెళ్లి ఆయన్ని కలవకుండానే రావటమా ? మరి అయితే ఎందుకు వెళ్లినట్లు? ఎందుకు వచ్చినట్లు? రైల్లో పడుకుని ప్రయాణం చెయ్యటానికా ?" అనుకుంది.

ఆశ్చర్యం నుంచి తేరుకుని భర్తకేసి తిరిగే సరికి ఆయన గుప్పు గుప్పున చుట్ట పొగ వదుల్తూ కనిపించాడు.

దాంలో ఆవిడకి చిర్రెత్తుకొచ్చింది. అసలు విషయం చెప్పక ఏమిటీ నాన్చుడు? అను కున్నది.

కాస్త దూరంగా వున్న కుర్చీని భర్త దగ్గరకు బరబరా జరుపుకుని కూర్చుంటూ "ఇంతకీ మీ రసలు హైదరాబాదుకి వెళ్లారా లేదా ?" అంది అనుమానంగా.

"చూడు సీతా. ఒక్కోసారి ప్రయాణం పెట్టుకున్న వేళా విశేషం చాలా మంచిది. అన్నీ సవ్యంగా జరిగిపోతాయి. ఇంతకీ మన సంధ్య చాలా అదృష్టవంతురాలు. ఎందుకో తెలుసా ? చెప్తాను విను......"

"నేనసలు వెంకట్రామయ్యగారిని * కలుద్దామని వెళ్లానా ? తీరా హైదరాబాదుకి ఇంకో రెండు స్టేషన్లు వుందనగా నాకు ఏన రమేష్‌కుమార్ కనిపించాడు. అతను ప్రస్తుతం మెడిసిన్ పూర్తిచేసి గవర్నమెంటు




నిన్నటివరకూ ఛందస్సునే
భావించాను ధనుస్సుగా
కావ్యానికి ప్రాణమైన భావం
భవ్యతరమైన బాణమే !

వుద్యోగం చేస్తూ ఎం. డి. చేస్తున్నాడట. ఇంతకీఅసలు నీకతను గుర్తున్నాడా" అన్నాడు.

సీతమ్మ స్ఫురణకి, తెచ్చుకుందుకు ప్రయత్నిస్తూ "గుర్తులేకేంగాని... రమేష్‌కుమార్ అంటే ఆ విశ్వనాథంగారి అబ్బాయి రమేష్. అంటే ఆ కవలపిల్లల్లో పెద్దవాడు కదూ! మనింట్లో వున్న ఆ టేబుల్ లైట్ మీకు ప్రజెంటు చేసింది అతనే కదూ !" అంది. అతని రూపాన్ని గుర్తుకి తెచ్చుకుంటూ.

"అమ్మయ్య. రక్షించావ్. అక్షరాల అతనే. విశ్వనాథంగారి కవలపిల్లల్లో పెద్దబ్బాయి. రెండో అబ్బాయి సురేష్‌కుమార్. ప్రస్తుతం వరంగల్‌లో ఇంజనీరింగ్ కోర్సు ఆఖరి సంవత్సరంలో వున్నాడట. వాళ్లు ఒకప్పుడు నా స్టూడెంట్స్ అని చెప్పుకుందుకు నా కెంతో ఆనందంగా వుంది"......

"సరే. ఇంతకీ అసలు విషయం చెప్తాను నన్ను ప్లాటుఫారంమీద చూసి తను కూడా గబగబా నేనున్న పెట్టెలోకి ఎక్కాడు. తన్ను చూసి చాలా ఆనందించాడు. "మాష్టారూ...... మాష్టారూ" అంటూ ఎంతో ఆపేక్షగా పలకరించాడు.

ప్రస్తుతం వాళ్ల నాన్నగారు రిటైర్ అయి వాళ్ల స్వంత వూళ్లోనే వ్యవసాయం చూసుకుంటున్నారట.

రమేష్ హాస్టల్‌లో వుంటున్నాడు. ఎం. డి రెండో సంవత్సరం కూడా త్వరలోనే పూర్తి కావస్తున్నది.

"ఇంతకీ మీకు హైదరాబాదులో ఏంపని మాస్టారూ ?" అన్నాడు.

"సంధ్యకి పెళ్లిసంబంధం చూడటం కోసమని వివరంగా చెప్పాను. అప్పుడతనే మన్నాడో తెలుసా సీతా ?..."

"మీ సంధ్యకి ఇంకా పెళ్లి కాలేదా మాస్టారూ !?" అన్నాడు సంభ్రమంగా రమేష్.

"లేదు నాయనా ! రెండు మూడు సంబంధాలు చూశాను. ఒకటి వుంటే ఒకటి లేదు. నేనా వేలకి వేలు కట్నం ఇచ్చుకోలేని వాడ్ని. నాకు కూతురైనా కొడుకు అయినా అదేకదా ! ఏదో దాన్ని ఓ అయ్యచేతిలో పెడితే నా బాధ్యత తీరిపోతుంది. అమధ్య కొన్నాళ్లు చదువు మానేసింది. కాని ప్రస్తుతం మళ్లీ బి. ఎ. కి చదువుతున్నది" అన్నాడు రామ్మూర్తి.

కొద్దిసేపు ఇద్దరిమధ్యా మౌనం రాజ్యం చేసింది.

తరువాత అతనే మెల్లిగా అన్నాడు. "మాస్టారూ ! మీరేమి అనుకోనంటే నేనో విషయం చెపుతాను" అని.

"అనుకోవటానికేముంది. చెప్పు రమేష్" అన్నాడు రామ్మూర్తి.

"ఏంలేదు మాస్టారూ. మీ కభ్యంతరం లేకపోతే మీ సంధ్యని నేను చేసుకుంటాను. నేను ఏదో ఆవేశంలో అనాలోచితంగా చెప్తున్నాననుకోకండి. నా మనసులో ఎన్నాళ్లక్రిందటో మొలకెత్తిన కోరిక ఇది. అప్పట్లోనే అంటే ... అంటే ... నేను మీ యింటికి ట్యూషన్‌కి వచ్చే రోజుల్లోనే సంధ్య నా మనసుని ఆకట్టుకుంది. నా హృదయంలో చోటుచేసుకుంది. కాని అప్పట్లో సంధ్య అంటే నాకెంత ఇష్టమున్నా అప్పటి నా పరిస్థితి వేరు. అప్పుడు కేవలం నేను విద్యార్థిని. నేను ఒక ఆదర్శం పెట్టుకున్నాను. ఎంతటి కష్టనష్టాలకోర్చి అయినా నేను ఓ డాక్టర్ని కావాలి. ఆ తరువాతే నా మనసు నా జీవితం అన్న విషయాలకి ప్రాముఖ్యం ఇచ్చేది అసలు అప్పట్లో నాకంటూ ఓ వ్యక్తిత్వం, స్థానం లేని అటువంటి పరిస్థితుల్లో ప్రేమకి - పెళ్లికి ప్రాముఖ్యంలేదు. అందుకే సంధ్యపై ఎంత కోరికవున్నా, సంధ్య నాచెయ్యి జారిపోతుం దేమోనన్న భయమున్నా నేను ఏమీ చెయ్యలేక పోయాను. కాని ఇప్పుడు నా అదృష్టం కొద్దీ మీరు కనిపించారు. అవకాశం వచ్చింది కనుక చెప్తున్నాను. మీకు అభ్యంతరం లేనిపక్షంలో నేను సంధ్యని నిండు మనసుతో స్వీకరిస్తాను. ఆలోచించండి. సంధ్యనికూడా కనుక్కోండి" అన్నాడు.

"సంధ్యనికూడా కనుక్కోండి" అన్నాడు

గాని ఆ అవసరం లేదని అతని మనసుగట్టిగా చెప్తోంది. ఎందుకంటే లేత హృదయాల్లో చిగురించిన ప్రేమ చాలా బలమైంది. అప్పట్లో సంధ్యకికూడా తనంటే చాలా ఇష్టం వుండేది. ఇప్పుడు ఆమె అభిప్రాయం మారిందేమో ... తను చెప్పలేదు గాని, ఆరోజుల్లో తను కనిపించగానే ఆమె కళ్ళల్లో మెరిసే మెరుపు ఎంతటిదో తనకి బాగా జ్ఞాపకం వుంది. మాస్టారికి మాత్రం ఎందుకుంటుంది అభ్యంతరం?'' అనుకుంటూ ఆయనకేసి తిరిగాడు.

''రమేష్'' అంటూ కృతజ్ఞత నిండిన చూపుల్తో రామ్మూర్తి అతని చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

''రమేష్! ఆలోచించు కోటానికేముంది నాయనా? అన్ని విధాల వున్నతుడివి. అంత స్తుల అంతర్యం తప్పించి వేరే అడ్డంకులు ఏముంటాయి. మీ ఎత్తుకి నేను తూగగలనా చెప్పు అదొక్కటే నా ఆలోచన. లేకపోతే నేనే వచ్చి స్వయంగా నిన్ను అడిగి వుండేవాడిని. ఆశకి కూడా అంతం వుండాలి కదా!'' అన్నాడు రామ్మూర్తి.

అందుకు రమేష్ జవాబు ఇది.

''మాస్టారూ! అదంతా మీకనవసరం. మీరు నాన్నగార్ని కలవండి. చాలు. మిగతా విషయాలు అన్నీ నేను మాట్లాడుకుంటాను నాకు కట్నంమీద మోజులేదు. సంధ్యనే కాదు నేను అసలు వివాహం అంటూ చేసుకుంటే కట్నం తీసుకోకుండానే. డబ్బుకి కాక,

# జీవన సంధ్య

అమ్మాయికి, ఆమె వ్యక్తిత్వానికి విలువనిచ్చి చేసుకునేది పెళ్ళి కాని ఇంత చదువు చదువుకున్నది వెర్రిగొర్రెలా డబ్బుకి అమ్ముడు పోవటానికి కాదు...

నాన్నగారు ఏమంటారోనని మీరు భయపడి కించపడవలసిన పనిలేదు. నా అభిప్రాయాల గురించి, నా ఆదర్శాల గూర్చి నాన్నగార్కి ఎప్పుడో ఖచ్చితంగా చెప్పాను. నాన్నగారు అభ్యంతరం చెప్తారని నేను అనుకోను. అసలు చెప్పరు. చెప్పినా నేను లక్ష్యపెట్టను. పెళ్ళి చేసుకునేది నేను. నా భార్యని ఎంచుకోవల్సింది నేను. నాకు అక్కర్లేని కట్నకానుకల విషయంలో పెద్దవాళ్ళ ప్రమేయం వుండదు. నాకుగా నేను సంధ్యని చేసుకుంటాను. కాని పెద్దవారు నాన్నగారికి తెలుపటం ధర్మం. కాని నేను ఒక్క విషయం గర్వంగా చెప్పుకోగలను మాస్టారూ మా నాన్నగారు చాలా మంది తండ్రుల్లాంటి వారు కాదు. ఆయన పెద్దరికాన్ని ధ్వంసం చేసుకునేటంతటి అల్పత్వం ఆయనలో లేదు. మా నాన్నగారిలో నేను కేవలం తండ్రినే కాదు, ఒక మంచి స్నేహితుడ్ని కూడా చూసుకోగలిగాను. ఎన్నోసార్లు నేను అటువంటి అనుభూతితో ఫీలయ్యాను'' అన్నాడు ఆనందంగా రమేష్.

అతను చాలా నమ్మకంగా గట్టిగాచెప్పాడు అందుకే నేను వెంకట్రామయ్యగార్నికలుసుకో లేదు. రమేష్ కోరి చేసుకుంటానన్నాడు కనక గాని లేకుంటే అతను మన చేతికి అందని చందమామే కదా! సరే... ఈ సంగతి ఏమిటో తేల్చుకున్నాకనే ఆ వెంకట్రామయ్యని కలవచ్చని వూరుకున్నాను' అసలు రమేష్ కూడా అదే అన్నాడు. ''అంత అవసరం మీకు రాదు మాస్టారూ'. అని దృఢంగా పలికాడు.

అసలు రమేష్ మొదటినుంచి చక్కటి వ్యక్తిత్వం, మంచి సంస్కారం గలవాడు. మాటకి—మనిషికి విలువనిచ్చే రకం. నేనేం అమ్మాయిని చేసుకోమని బలవంతం పెట్టలేదు. తనకిగా తానే ఈ విషయం ప్రస్తావించాడు. తన అభిప్రాయం వెల్లడించాడు. ఇంక ఆశ పెట్టుకోకుండా నమ్మకుండా ఎలా వుండగలం? అందుకే ఆ వెంకట్రామయ్య గుమ్మం కూడా ఎక్కకుండా వచ్చేశాను. మరి ఇంతకీ నువ్వేమంటావ్?'' అన్నాడు భార్యకేసి చూస్తూ రామ్మూర్తి.

సీతమ్మకు కూడా భర్త చెపుతున్నదంతా వింటుంటే ఆనందంతో నోటమాట రాలేదు. అదంతా ఓ కథలాగో... కలలాగో తోచింది. అంతా అయోమయంగా అన్పించింది. కళ్ళ ముందుకూతురుమెదిలింది. ఇంతకీ దీనికిఎక్కడ రాసివుందో!... పూర్లోని ఉప్పురాయికి పూరి చివరి వుసిరికాయకి జత. దైవఘటన ఎలా వుంటే అలా జరుగుతుంది. అనుకుంది మనసులో.

''నేను అనటానికేముంది? అంతా అమ్మాయి అదృష్టం ఎలాగుంటే అలాగ జరుగుతుంది. ఏదో ఒక్కగానొక్క పిల్ల. అయినందుకు దాని జీవితం ఓ సక్రమమయిన మార్గాన పడితే అంతే చాలు'' అంది.

''అదికాదు సీతా! రమేష్‌పై నీ అభిప్రాయమేమిటి?'' అన్నాడు.

''రమేష్‌కేం? అన్ని విధాల యోగ్యుడు. మన వూహలకి కూడా అందని స్థాయిలో వున్నాడు. యింకా అతని తమ్ముడు తలబిరుసు మనిషికాని ఇతను చాలా నెమ్మదస్తుడు. మర్యాదస్తుడు. నిజంగా అతను మన అల్లుడుఅయితే మనంతఅదృష్టవంతులు ఎవరూవుండరు'' అంది సంతృప్తిగా సీతమ్మ.

* * *

తల్లి, తండ్రి హాల్లో కూర్చుని చెప్పుకుంటున్న మాటలన్నీ సంధ్య కర్ణపుటాలు తాకి మనసులో సంగడి చేశాయి. ''రమేష్''



రూపం ఆమె మనోనేత్రం ముందు నిలిచి కలవర పెట్టసాగింది. హృదయపు అట్టడుగు పొరల్లో నలిగిపోతున్న మమత — అనురాగం ఒక్కసారిగా మనసుని పెల్లగించుకుని పైకి వచ్చి పొంగి పొర్లాయి.

అతను తమ యింటికి ట్యూషనుకి వచ్చి నప్పటి రోజులు కళ్లముందు మెదిలాయి...... ట్యూషన్‌కి వచ్చినప్పుడల్లా తనతో ఏదైనా కల్పించుకుని మాట్లాడేవాడు. ఎంతో తరాధనగా చూసేవాడు. "సం...ధ్యా" అన్న ఆ రెండు అక్షరాల్లో ఎంతో ఆపేక్షని నింపుకుని పలకరించేవాడు. అప్పట్లో తనకి రమేష్‌పై ఒక విధమైన అనురాగం ఏర్పడింది. అతని పట్ల గొప్ప ఆరాధన భావం జనించింది. కాని దాన్ని పెంచుకోడానికిగాని, బహిర్గతం చెయ్యటానికిగాని తగినంత సాహసం లేకపోయింది. అందుకు కావలసిన వయసూ లేదు.

రమేష్‌తండ్రి పెద్ద గవర్నమెంటుఉద్యోగి. ఇతరత్రా కూడా వాళ్లు మంచి ఆస్తిపరులు కావటంలో చాలా హోదాగా ఉండేవారు. అంతస్తుల తారతమ్యంవల్ల తన అనురాగమంతా లోలోనే అణగ్రదొక్కేసుకుంది. రమేష్ మీద ఎక్కువ ఆశలు పెట్టుకోలేదు. అతను ప్రత్యేకంగా తనతో మాట్లాడుతాడు. ప్రతీపదంలోనూ ఆపేక్ష వ్యక్తం చేస్తూ, ఆరాధన అంతా కళ్లల్లో ప్రతిఫలింపచేస్తాడు. చాలు. ఆమాత్రం చాలు... అనుకుని తృప్తి పడేది సంధ్య.

చంద్రుని కోసం కలువకన్నెలు ఎదురు చూసినట్లుగ రోజంతా అతనికోసం, అతని చల్లని చూపుకోసం ఎదురు చూసేది. అది లభించగానే మనస్సంతా అహ్లాదకరంగా తయారయ్యేది.

అతని తమ్ముడు సురేష్! వాళ్లిద్దరూ కవల పిల్లలు. అచ్చుగుద్దినట్లు ఒకే పోలికల్తో ఒకే ఎత్తులో వుండేవారు. రూపురేఖల్లో అణువంతైనా తేడా లేదు. కాని ప్రవర్తనలో మాత్రం ఇద్దరికీ చాలా తేడాలే వుండేవి. అభిరుచులు కూడా అంతే!

రమేష్ మితభాషి. వినయంగా వుండేవాడు. వత్తయిన క్రాఫ్‌ని అణచి అణచి ప్రక్కకు దువ్వుకునేవాడు. డ్రెస్ చేసుకోవటంలోకూడా పెద్ద ఆడంబరతని చూపించేవాడు కాదు. ఎక్కువగా అమ్మాయిల్తో మాట్లాడేవాడే కాదు. అతను మాట్లాడే అమ్మాయి ఒక్క సంధ్య మాత్రమే!

కాని సురేష్ అలాకాదు. వత్తయిన తన క్రాఫ్‌ని నుదురంతా కప్పేలా దువ్వుకుని, సైడ్ లాక్స్‌తో, హిప్పీ స్టయిల్‌తో వుండేవాడు. ఎప్పుడూ బెల్‌బాటమ్స్ వేసుకుని పెద్ద పెద్ద గాగుల్సు చేతిలో పట్టుకుని స్టయిల్‌గా తిరిగేవాడు. ఎప్పుడూ ఏదో ఒక హిందీపాట పాడుతూ వుండేవాడు. తను ఎప్పుడు కనిపించినా చొరవగా పలకరించేవాడు. ఎంత మందిలో వున్నా పలకరింపుగా నవ్వుతూ చూసేవాడు. అటువంటి అతని ప్రవర్తన సంధ్యకి బొత్తిగా నచ్చేదికాదు. రెండుసార్లు ప్రేమలేఖలు కూడా వ్రాసాడు. చదువుకుని చింపేసింది సంధ్య.

ఆ తరువాత రామ్మూర్తి బదిలీ కారణంగా తమ స్నేహం విడిపోయింది. ఇదంతా జరిగికూడా 5, 6 సంవత్సరాలు కావస్తున్నది. మళ్లీ ఇన్నాళ్లకి వాళ్ల ఆచూకీ తెలిసింది. అంతా విధివిలాసం. లేకుంటే ఏమిటి? నాన్న ఒకపనిమీద హైద్రాబాదు, వెడితే ఇంకోటి జరిగింది. ఇలా జరుగుతుందని ఎన్నడైనా అనుకున్నామా?

అసలు "రమేష్" అంటే తనకి మాటల్లో చెప్పలేనంత ఇష్టం. కాని అతనితో తనకి వివాహం అన్న ఆలోచన వూహల్లో కూడా రాలేదు. "అతను తన్ని ప్రేమించు తున్నాడు అతనికి నేనంటె ఇష్టం" అన్న అభిప్రాయం ఎంత ధృడంగా అన్పించినా మనసు విప్పి "నన్ను పెళ్లి చేసుకుంటావా రమేష్" అని అడగలేకపోయింది అప్పట్లో. అసలు అలా అడగటం చాలా అల్పత్వంగా, స్నేహం—ప్రేమ అనే పదాలకి గొడ్డలి పెట్టులాగ తోచింది తనకి. రమేష్‌ని ఎప్పుడూ అందని జాబిలి లాగే ఆరాధించింది. కాని తమ చిన్ననాటి చెలిమి ఫలించి తనకి అందదు అనుకున్న జాబిలి అందబోతున్నాడంటే సంధ్యకి మనస్సు ఆనందంతో వుప్పొంగుతున్నది. తమ ప్రేమ యింత బలమైనదా?—

"వివాహాలు నిజంగా దైవనిర్ణయాలే" అనుకుంది. లేకుంటే ఏమిటి? ఎప్పటి స్నేహం తమది? ఈ మధ్య కాలంలో ఎన్ని మార్పులు జరిగాయి? ఎన్ని రోజులు దొర్లిపొయ్యాయి? కాని ఇంకా తను అతని మనసులో నిలిచి వుందనుకుంటే కించిత్ గర్వంగా అనిపించింది సంధ్యకి. బలంగా ఆకర్షణీయంగా వుండే రమేష్ కళ్ల ముందు మెదిలాడు. మత్తుగా కన్నులు ముసుకుంది.

## నమ్మూ నమ్మకపో!

★ భారతదేశంలో 200 రకాల పాములు వున్నాయి

★ ఇటలీలో ఎంతటి నేరస్తురాలైనప్పటికీ గర్భిణీ స్త్రీని జైల్లో పెట్టడం చట్టరీత్యా జరగదు.

★ అర్ధరాత్రి 12 గంటలకు జరిగిన ఒక సంఘటనను 12 నిమిషాల్లో ఒకడు ఇద్దరికిచొప్పున చెప్పుకుంటూపోతే తెల్లవారకముందే ప్రపంచంలో ప్రతి ఒక్కరికీ తెల్సిపోతుంది.

★ ప్రపంచంలోని మొట్టమొదటి పత్రిక 1731లో ఇంగ్లీషులో వెలువడింది. దాని పేరు "జంటిల్‌మెన్స్ మేగజైన్"

★ 'ఇండియా' లో 11,329 పత్రికలు ప్రచురింపబడుతున్నాయి. వాటిలో 3,608 వారపత్రికలు, మిగిలినవి పక్ష, మాస, త్రైమాస, అర్ధసంవత్సర, మరియుసంవత్సర పత్రికలు. రోజూ వెలువడే వార్తా పత్రికలు ఇందులోకి రావు.

★ ప్రఖ్యాత రచయిత 'షేక్స్‌పియర్' కూతురికి చదువనూ, రాయనూ రాదు.

★ జత ఎలుకల్ని ఒక బోనులో పెట్టి సంవత్సరం వుంచితే ఆ జత ఎలుకలు 400 ఎలుకల్ని వుత్పత్తి చేస్తాయి.?!

★ 'మిణుగురు' పురుగు ఎగిరేప్పుడు వుండే కాంతి అది నిద్రించినపుడు వుండదు.

★ మిడత తల నరికేసినా గాని దాని మిగత శరీరం చక్కగా నడిచి వెళ్తుంది

★ పాములాగా 'కుబుసం' విడిచే జీవి 'ఊసరవెల్లి'.?!

— కె. చందర్‌రావు

ఆ తలపులతో ఎంత సేపువుందోతెలియదు.

"అమ్మా సంధ్యా! నాన్నగార్కి నీళ్లు తోడు" అంటూ తల్లి పిలిచిన పిలుపుకి వులికిపడి మెల్లిగా కళ్లు తెరిచింది. దారాలు వక్కకిపెట్టి కలల్లోంచి నడిచి వెడుతున్నట్లుగా పెరట్లోకి కదిలి వెళ్లింది.

అట్లా వెడుతున్నప్పుడు ఆమె నిడుపాటి వత్తయిన జడ భారంగా వీపుమీద కదులాడింది.

* * *

వివాహాలు దైవనిర్ణయాలు. ఆ నిర్ణ

యానికి అనువుగా అన్ని పరిస్థితులు కలిసి వస్తాయి. సంధ్యని తన కోడలుగ చేసుకోవటానికి విశ్వనాథంగారికి పెద్దగా అభ్యంతరం లేకపోయింది. చేసుకొనేది కొడుకు. అతడు మనసారా ఇష్టపడ్డాడు. కట్నం తీసుకోవటం అతని ఆశయానికి విరుద్ధం. కొడుకు పెళ్ళి అతని ఇష్టప్రకారం జరిపించటం తండ్రిగా తన విధి..

సంధ్య గుణవంతురాలు చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఆ అమ్మాయిని చేసుకున్నందువల్ల కొడుకు జీవితం సుఖప్రదమవుతుంది అనుకున్నారు.

ఏవిధమైన అడ్డంకులు లేకుండానే సంధ్యా — రమేష్‌ల వివాహానికి ముహూర్తం నిర్ణయమైంది,

అన్నగారి వివాహం అన్న సంగతివిని సురేష్ సంతోషించాడు. కాని వధువు రామ్మూర్తి మాస్టారి అమ్మాయి "సంధ్య" అనగానే అతని వదనం క్షణంలో వివర్ణమైంది. ఎప్పటి సంధ్య ? ఎన్నాళ్ళ తమ పరిచయం ? ఆరోజుల్నాటి స్మృతులు జ్ఞాపకానికి వచ్చాయి !......

... నిజం చెప్పాలంటే అన్నయ్యే అన్నమాట ఏమిటి ? తానూ సంధ్యని ఎంతగానో ప్రేమించాడు. ఆరోజుల్లో తనూ

# జీవన సంధ్య

ఆమెకి ఎంతో దగ్గర కావాలని తాపత్రయపడ్డాడు. తెలిసీ తెలియని మనసు విరిసీ విరియని వయసు "ప్రేమ" అంటే ఏమిటో అప్పుడే తెలిసి వస్తున్న శుభ సమయంలో తన మనసు సంధ్యపై లగ్నం అయ్యింది.

కాని సంధ్య తన అన్న రమేష్‌తో మాట్లాడినంత చొరవగా, ప్రేమగా తనతోటి వ్యవహరించేది కాదు. అక్కడికి తను అభిమానం చంపుకుని మనసు విప్పి రాసిన ప్రేమలేఖల్ని సయితం తన ఎదురుగానే చింపేసి అవమానపరిచింది. ఆవిషయం తను ఈ జన్మకి మరిచిపోగలడా!?

తరువాత వాళ్ళ బదిలీ కారణంగా తమ స్నేహం విడిపోయింది. ఆస్నేహం అక్కడితో ముగిసిందనే అనుకున్నాడు. ఒక విధంగా రమేష్‌కి సంధ్య దూరం కావటం చూసి ఆనందించాడు. తన్ని తిరస్కరించిన సంధ్యకి ఆపాటి ప్రాయశ్చిత్తం కావాల్సిందే అనుకున్నాడు!

కాని ఇదేమిటి? తిరిగి ఇన్నాళ్ళకి మళ్లీ అన్నయ్య ఆ సంధ్యనే చేసుకోవటమా ? చిన్ననాటి వారి చెలిమి చిగురాకు తొడిగి పుష్పించబోతోంది. అయితే ఇన్నాళ్ల నుంచి వారిద్దరి మధ్య స్నేహం అంతరించి పోలేదా ? ఎలా జరిగింది ఇదంతా ? చాలా చిత్రంగా వుంది. అనుకున్నాడు విభ్రాంతిగా.

అయినా సంధ్య వాడిలో ఏం చూసింది? రమేష్ అంటే ఆమెకి మొదట్నుంచీ అభిమానమే ! తనలోలేని ఆకర్షణలు, ప్రత్యేకతలు వాడిలో ఏమున్నాయి గనుక ? నిరంతరం హాస్పటల్‌లో రోగులమధ్య పడివుండే వాణ్ణి చేసుకుని ఏం సుఖపడదామనుకుంది ? తనలోలేని అందాలు వాడిలో ఏం చూసింది ? ఒకే పోలిక! ఒకే రక్తం! ఒకే తల్లి కన్న పిల్లలు! ఒకే మూసలోంచి వచ్చిన రూపాలు తాము! అయినప్పుడు అన్నయ్యలో గల ఏ ఆకర్షణకి ఆమె లొంగిపోయింది ?" అని తనలో తాను మథన పడ్డాడు. లేనిపోనివేవో కల్పించుకుని అనవసరంగా ఆవేశపడ్డాడు. అర్థంలేని ఆలోచనల్లో తన్ని తనే కించపరచుకున్నాడు. గిల్టీగా ఫీలయ్యాడు.

తను, అన్నయ్య ఒకే రూప లావణ్యాలుగల ప్రతిబింబాలు అనే అనుకున్నాడు గాని అన్నయ్యలో బాహ్యసౌందర్యంతోపాటు అంతః సౌందర్యం కూడా వుందని, అతని నడవడే పలువుర్ని ఆకట్టుకుంటుందని ఆలోచించలేకపోయాడు. సంధ్య కూడా అతని వ్యక్తిత్వానికే తలవొగ్గిందని అనుకోలేక పొయ్యాడు.

అనవసరపు ఆలోచనలతో మనస్సుని కలుషితం చేసుకున్నాడు. తన్ని తిరస్కరించిన సంధ్య... తన అన్నయ్యని ప్రేమించింది!తను మనసుపడ్డ అమ్మాయి తన అన్నయ్యకి అర్ధాంగి కాబోతున్నది! ఇంతకంటే నరకం ఇంకెక్కడ వుంటుంది? అనుకున్నాడు ఆవేశంగా. అతని కళ్లు బాధతో వదునుగా కదిలాయి. తల విదుల్చుకుని అశాంతిగా కుర్చీలో వెనక్కి వాలాడు భావి ఇంజనీర్ సురేష్ కుమార్ !

* * *

అనుకున్నవి అన్నీ సవ్యంగా జరిగిపోతూ వుంటే వుంటే కాలం ఇట్టే గడిచి పోతున్నట్టుగా అనిపిస్తుంది.

సంధ్యా-రమేష్‌ల వివాహం జరిగి మూడు నెలలు కావస్తున్నది. కాని సంధ్య ఇంకా కాపురానికి వెళ్ళలేదు. ఒక నెల అత్తగారి ఇంటవుండి తిరిగి పుట్టింటికివచ్చేసింది. దానికి కారణం ఇంకో నాలుగు నెలల్లో రమేష్‌కి ఎం. డి. పూర్తికావస్తున్నది. పైగా అతను ప్రస్తుతం హాస్టల్‌లో వుంటున్నాడు. కనుక



న్యూఢిల్లీలోని విజ్ఞాన్ భవన్‌లో జరిగిన 17వ బహుమతి ప్రదానోత్సవంలో అత్యుత్తమ శ్రేణికి చెందిన ముద్రణ, డిజైన్‌లకి ఆంగ్ల మాసపత్రిక స్పాన్‌కు, వార్షిక సంచిక స్పాన్‌ఫొలియోకి లభించిన జాతీయ అవార్డులను భారత ఉపరాష్ట్రపతి శ్రీ బి.డి. జత్తి భారతదేశంలోని అమెరికా సమాచార శాఖ అధికారి శ్రీ ఆల్‌బర్ట్ ఇ. హెంసింగ్‌కి అందజేస్తున్న దృశ్యం. భారత ప్రభుత్వం యిచ్చే జాతీయ అవార్డులని ఏడింటిని స్పాన్ అందుకున్నది. అంతేకాక ప్రతిఏడూ ఆలిండియా మాస్టర్ ప్రింటర్స్ సమాఖ్యవారు అత్యుత్తమస్థాయి ముద్రణకి ఇచ్చే అవార్డు రెండు సార్లు స్పాన్‌కి లభించింది.

ఆ చదువు పూర్తి అయ్యాక సంధ్యని కాపురానికి పంపాలని పెద్దలు నిశ్చయించుకున్నారు. పైగా అదే టైములో సంధ్యకి బి. ఎ. పరిక్షలు జరగనున్నాయి. కనుక ఉభయత్రా మంచిదని ఆవిధంగా నిర్ణయించారు. అవును మరి. సంసారానికి—చదువుకీ చుక్కెదురు !

కాని దంపతుల ఇద్దరి మధ్యా వుత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వున్నాయి. రమేష్ వీలునిబట్టి అప్పుడప్పుడు అత్తవారింటికి వచ్చి సంధ్యతో ఓర్రాత్రి గడిపి వీలుని బట్టి వెళ్లిపోతున్నాడు. కాని వెంటవెంటనే వుత్తరాలు వ్రాయటంలో మాత్రం సంధ్యదే బాధ్యత ఎక్కువ. ఎందుకంటే రమేష్‌కి ఎక్కువగా వుత్తరాలు వ్రాసే అలవాటులేదు. పైగా ఇప్పుడు క్షణం తీరికలేకుండా సతమతమవుతున్నాడు. అందుకని తను వీలునిబట్టి వ్రాస్తాడు కాని సంధ్యమాత్రం తరచూ వ్రాయాలని షరతు పెట్టాడు.

పగలంతా డ్యూటీ. రాత్రి అయ్యేసరికి చదువు. ఎక్కడి టైము చాలటంలేదు. ఒక్కొక్క రోజు ఒక్కొక్క క్షణంలాగ అనిపించుతోంది. నిరంతర పరిశ్రమతో నలిగిపోతున్నాడు ఎక్కడి టైము సర్దుబాటు కావటంలేదు. సంధ్యపై మనసుపోయినప్పుడు కన్నులు బరువుగా మూతలు పడతాయి. మనసుకి మత్తు ఆవరిస్తుంది. బలవంతాన కళ్ళుతెరిచి పుస్తకంపై దృష్టి నిలుపుతాడు. "ఈ వెధవ పరీక్షలు తొందరగా అయిపోతే బాగుణ్ణు. హాయిగా సంధ్యని తెచ్చుకోవచ్చు" అని ఆత్రపడుతున్నాడు.

ఇక్కడ సంధ్య పరిస్థితి అందుకు పూర్తి విరుద్ధం. ఒక్కొక్కరోజు ఒక్కొక్క యుగంలాగ గడుస్తున్నది. నిరంతరం అతని తియ్యని తలపులతో కాలం దొర్లించుతోంది.

సంధ్యనుంచి వుత్తరం వచ్చినరోజు రమేష్‌కి మరీ మరీ మనసు సోలిపోతుంది. రాకపోతే రాలేదన్న ఆరాటం ! ఇద్దరిమధ్యా ఇలా గడుస్తున్నది కాలం.

అయినా సంధ్యవైపు మరీ మనసు పరుగులు తీస్తే ఇంక వుండలేక రమేష్ అప్పటికప్పుడు అనుకుని బయలుదేరి ఓరాత్రి సంధ్య దగ్గర గడిపి ఆమర్నాడు చీకట్లు విడకుండా బయలుదేరి డ్యూటీ టైముకి వచ్చేస్తాడు.

రమేష్ రాకకోసం సంధ్య ఎదురు చూస్తుంది.



వాణ్ణి నమ్మకు గురూ ! లాట్రీలో ప్రైజొచ్చిందని కోస్తున్నాడు ...

సంధ్యావాళ్ళ పెరట్లోవున్న జాజిపందిరి సాయంత్రం అయ్యేసరికి దోసిళ్ళ కొద్ది పూలని పరబోస్తుంది. ఆ పూలన్నింటిని ఓపిగ్గా కోసి దోసిలినిండా పోసుకుని మత్తుగా కన్నులు అరమోడ్చుకుంటుంది. ప్రతీ పువ్వులోనూ రమేష్ మోహనరూపం కదులాడుతూ ఆమెని మైమరపిస్తుంది. అట్లా ఆ పువ్వుల్లోకి చూస్తూ గంటలకొద్ది గడిపెయ్యమన్నా గడపకలదు సంధ్య.

ఆ జాజిలన్నింటిని కలిపి పెద్ద దండ కడుతుంది. ఆ నాలుగు మూరల చెండుని తన పెద్దజడలో అమర్చుకుంటుంది. అద్దంలో చూసుకుంటూ...

"ఈవాళ తనువస్తే బాగుణ్ణు ...
ఈవేళ తను వస్తే బాగుణ్ణు ..." అనుకుంటుంది రోజు. అలాటి రోజుల్లో ఏదోఒకరోజు నిజంగానే వచ్చేస్తాడు రమేష్.

* * *

రమేష్ రూమ్‌లో కూర్చుని చదువుకుంటున్నాడు. ఇంతలో వార్డుబాయి ఫోన్ వచ్చిందనిచెప్తే లేచివెళ్లి రిసీవ్‌చేసుకున్నాడు.

"హలో...హలో..." అవతల్నుంచి సురేష్ మాట్లాడుతున్నాడు.

"నేను అన్నయ్యా సురేష్‌ని" అన్నాడు వుత్సాహంగా.

"నేను వచ్చి రెండు రోజులైంది. మీ హాస్టలికి వస్తే నువ్వు వూరికి వెళ్లావన్నారు. ఇక్కడ హోటల్‌లోదిగా." అంటూ వివరంగా తాను హైద్రాబాదుకి ఎందుకు వచ్చింది చెప్పాడు.

రమేష్ తమ్ముడు చెప్పిందంతా విని, ఆప్యాయంగా క్షేమ సమాచారాలు అడిగాడు. తను భార్య దగ్గరికి వెళ్లినట్టు చెప్పి "ఇంకా హోటల్‌లో ఎందుకు హస్టల్‌కి వచ్చెయ్యి" అన్నాడు.

"ఓ.కె" అని ఫోన్ పెట్టేశాడు సురేష్. ఎందుకో క్షణంలో సురేష్ మనసంతా అల్లకల్లోలంగా అయ్యింది. ఫోన్ చేసినప్పుడున్నంత వుత్సాహం ఫోన్ పెట్టేశాక లేదు.

అనాలోచితంగా కిటికీ దగ్గరికి వెళ్లి బయటికి చూస్తూ నిల్చున్నాడు. జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించి ఆలోచనలో పడ్డాడు ...

... సంధ్యని చూట్టంకోసం, ఆఫ్టరాల్ ఒక్క రాత్రికోసం అన్నగారు అంతదూరం పనిగట్టుకుని వెళ్లాడంటే అతనికి ఈర్ష్యగా వుంది. అంతవరకు వురకలు వేసిన వుత్సాహం చచ్చిపోయింది. ఎంత లేదన్నా అన్నగారి ప్రయాణానికి ముప్ఫయి నలభయి రూపాయల ఖర్చు. ఒక్కరోజు కోసం ! అదే తను ఖర్చు చేస్తే తల్లితండ్రి తిడతారు. డబ్బు జల్సాలకి ఖర్చు చేస్తున్నానని ఆరోపిస్తారు. కాని అన్నయ్య ఖర్చుపెట్టేది మాత్రం దుబారా కాదు. అసలు మొదట్నుంచి అంతే. అన్నయ్య అంటే నాన్నకి అమ్మకి కూడా అపేక్ష ఎక్కువ. నాకంటే ఒక్క గంట ముందు పుట్టిన భాగ్యానికే వాడు ఇంటికి పెద్దకొడుకు అయిపోయాడు. కాగా శ్రద్ధగా చదువుతాడని, సినిమాలకి షికార్లకి తిరగడని వాళ్లకి మక్కువ. కానీ మరీ అంత చచ్చురకంగా వుండటం తనకి చాతకాదు. నేను పది రూపాయలు ఖర్చుపెట్టినా వాళ్ల దృష్టిలో వంద రూపాయలు ఖర్చుపెట్టినట్లే వుంటుంది. కాని ఇప్పుడు అన్నయ్య ఖర్చుపెట్టేదంతా డబ్బుకాక మరేమిటి ? ఒక్క రోజు కోసం అఫ్టరాల్ ఒక్క రాత్రి కోసం అంత దూరం పడిపోకపోతే ఏం మునిగిపోయింది? ఓ పది రూపాయలు పారేస్తే ఆపాటి ఆనందం ఈ హైదరాబాద్‌లో దొరక్కపోయిందా? హుం.. సంధ్య ! ఎవరీ సంధ్య ! నా ప్రేమని తిరస్కరించి నా లేత మనస్సుని గాయపరిచిన సంధ్య అన్నయ్యపై అమృతం కురిపిస్తున్నది. వాడి మనస్సులో మల్లెలు పూయిస్తున్నది. తనలో ఏముంది లోపం? ఎక్కడుంది అపశ్రుతి— "అబ్బా..."— కాలిన సిగరెట్ పెదవుల కంటుకుని చురుకపెట్టింది.

సిగరెట్ ముక్క పారేసి పెదవులు చూపుడు వ్రేలితో రాచుకుంటూ అన్యమనస్కంగా గదిలో పచార్లు చేస్తూ డ్రస్సింగ్ టేబిల్ ముందుకి వచ్చి నిలిచాడు.

(ఇంకావుంది)




చేతకాని మొగుడుమీద విరుచుకు పడ్తూన్న గయ్యాళి పెళ్లాంలాగ సూర్యుడు మండి పడ్తున్నాడు లోకంమీద.

ఉదయం పది గంటలు కాకుండానే ఎండ యింత ఘోరంగా వుంది. పోనుమరి. 'మే' నెల వచ్చేసిందిగా. పరుగులాంటి నడకతో బస్‌స్టాపు చేరుకున్నాను. జనం బాగానే వున్నారు. అంటే బస్సు యింకా రాలేదన్న మాట. అమ్మయ్య అనుకొని అలవాటుగా చుట్టూ చూసేను. చేతి రుమాలతో మొఖం అద్దుకొంటూ. అంతమంది జనంలోనూ నా దృష్టికి ఏదో వెలితి అనిపించింది.

'అతను' యీ రోజు ఇంకా రాలేదేమో?' బహుశః వస్తూ వుండాలి.

'అతను రాకపోతే నీ కెందుకు?' అని చాలాసార్లు నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. కాని జవాబు దొరకలేదు'

అతను యీ పదో నెంబరు బస్‌స్టాపుకి రోజూ హాజరయ్యేవాళ్లలో కొత్త మెంబర్.

వారం పది రోజుల క్రితం కాబోలు నేను అతన్ని మొదటిసారి చూసేను. మనిషి చామనఛాయలో వున్నా చూడ్డానికిహుందాగా, బాగానే వుంటాడు. అందం మాట ఎలా వున్నా అతని మొహంలో వుట్టిపడే సభ్యత, సంస్కారం ఎవర్నైనా ఆకర్షిస్తాయి. భగవంతుడు కొందరిలో అన్నీ మంచి లక్షణాలుంచి, 'దిష్టి తగలకుండానా ?' అన్నట్లు కాబోలు ఏదో ఒక లోపం......

నా ఆలోచనలో నే నుండగానే బస్సు వచ్చేసింది. ఆత్రుతగా అటు చూసేను. అదుగో ! వచ్చేస్తున్నాడతను. అతను ఇక్కడికి చేరేలోగా ఈ బస్సు కాస్త కదిలిపోదు కద ! నేను రోజూ యిలా భయపడ్డం, అతను ఎలాగో అలాగ బస్సందుకోడం మామూలయిపోయింది. ఒక్క నిముషం ముందుగావస్తే ఇతని సొమ్మేం పోతుంది! అందరిలాగా కాళ్లు రెండూ లక్షణంగావుంటే వేరే సంగతి.

కాని ఇతనికి పాపం ! కుడికాలు సరిగాలేదు పాదం బాగా అడ్డం తిరిగి వుంటుంది. మోకాలి ముణుకుమీద అరచెయ్యి ఆన్చందే నడవలేడు ? బస్సులోకి ఎలాగో చచ్చిచెడి ఎక్కేక ఎవరేనా జాలిపడి యిచ్చిన జానెడు జాగాలో సర్దుకొని కూర్చుంటాడు. లేదా అలానిలబడ్డానికే, తంటాలు పడతాడు తప్ప జాగా అడుగడు.

ఇలాంటి వాళ్లను చూసినప్పుడల్లా, నాకు మా సుజాత జ్ఞాపకం వస్తుంది. నేనూ, తనూ ఒకే కంచంలో తిని పెరగకపోయినా ఒకే స్కూల్లో చదువుకున్నాం. ఒకేకాలేజీలో చదువైందనిపించేం. అందం, ఐశ్వర్యం కలబోసి రాశిపోసినట్లుండే సుజాత అంటే నాకు ఏనాడూ అసూయలేదు. దానివీ, నావి అభిప్రాయాలు, అభిరుచులు ఎప్పుడూ ఒకటే. కాని ఒకే ఒక విషయంలో మాత్రం నామనస్సెప్పుడూ బాధతో మూలిగేది.

ప్రపంచంలో బాధలు, బెంగలూ అనేవి వుంటాయా? వుంటేమాత్రం నాకు వాటితో సంబంధమేమిటి ? అన్నట్టుండే తన వింత ధోరణి, కేవలం తన గురించే ఆలోచించే తన మనస్తత్వం నాకు బొత్తిగా నచ్చేదికాదు. పదిమంది స్నేహితురాళ్లకి ఒక వెధవ చెత్త సినిమాకోసం బాల్కనీ టిక్కట్లు కొనిపెట్టే దాని ఔదార్యం బస్‌స్టాండులో తనముందు నిల్చున్న ఒక ముష్టివాడికి ఒక పైస కాదు కద, కనీసం ఒక వేడి నిట్టూర్పుని కూడా ఖర్చుపెట్టడానికి అంగీకరించేదికాదు.

కాలో చెయ్యో వంకరపోయినవాళ్లు ఎదుటపడ్తే చివాలున ముఖం తిప్పుకొనే సుజా కళ్లలోకి పరీక్షగా చూస్తే నాకు కనిపించేది జాలికాదు, భయంకాదు. భరించలేని అసహ్యం, తనకెంత డబ్బుంటే మాత్రం, రోజూ దానం చెయ్యమని నేననలేను. కాని మనల్ని పుట్టించిన దేవుడే వాళ్లనీ ఈ భూమ్మీద పడేశాడు. ఏదో ఒక లోపాన్ని సృష్టించి ఎలాగో అలాగ బతకండర్రా అంటూ ఈ లోకంలోకి వదిలిపెట్టేడు. మనకంటే క్రిందమెట్టుమీద ఉన్న మనిషికి చెయ్యి ఆసరా ఇవ్వకపోతే పోనీ ! మరింత కిందకి నెట్టాలా ? వాళ్లు మనకి చేసిన అపకారం ఏమిటి ? ఈమాటే నేను ఎప్పుడేనా తనతో అంటే, 'పోనిద్దూ, ఏ జన్మలో చేసుకున్న పాపమో ఈ జన్మలో అనుభవిస్తున్నారు. నువ్వు, నేను జాలిపడి చేసేదేముంది. అటు చూడకపోతేసరి !'' అనేది చిరాగ్గా ముఖంపెట్టి.

---

**పోలికలు**

సినిమా టిక్కెట్లకోసం ''క్యూ''లో జనంలా
బారులుగా వెళుతున్నాయి కొంగలు.
ఈసారి లాటరీ తప్పక వస్తుందని ఎదురుచూసే
నిరాశా పరుడిలా ఎదురు చూస్తోంది చాతకపక్షి
సంతబజారులో ప్రజలలా హడవిడిగా
అరుస్తున్నాయి కాకులు
ఏ ఒడుదుడుకులకు ఎదురీదాలో నుంకునే
సామాన్యునిలా నిలబడి ఉంది ఏటిలో చిన్ననావ.
ఇదే సంధ్యలో సమాజం
సమాజంలో సంధ్య !

—స్వర్ణ

---

''నిజమే ! మన జాలివల్ల, వాళ్ల లోపాలు అంతరించిపోవు. కాని, అసహ్యించుకోపోతే, అదేచాలు.'' ఇలా సాగేవి నా ఆలోచనలెప్పుడూ. దేవుండి సృష్టిలోనే లేని సమానత్వం దేవుడు పుట్టించిన మనుష్యుల్లో ఎలా వస్తుంది ? ఒక్కొక్క రాత్రి నిద్ర పట్టకపోతే 'ఎప్పుడు చూసినది అప్పుడే మర్చిపోక, నే నెందుకిలా ఆలోచిస్తాను ?' అని నా మీద నాకే కోపమొచ్చేది.

రోజులు ఎంత రొటీన్‌గా గడిచిపోతున్నా ఏదో ఒక ప్రత్యేకత, ఒక చిన్నమార్పు లేని రోజంటూ వుండదు ఏ మనిషి జీవితంలో నైనా. ఆఫీసు, ఇల్లూ, శ్రీవారు, ఆదివారాలు, బ్రతుకు మరీ బోరుగా, చదివేసిన పుస్తకాన్నే మళ్లీ మళ్లీ చదువుతున్నట్టు మహా విసుగ్గా వుంది.

ఆవేళ ఏమీ తోచడంలేదని శ్రీవారితో కలిసి సినిమాకు బయలుదేరాను. సినిమా రిలీజ్ అయిన రోజు అవడంవలన 'రష్'గా వుంది. సినిమా అయిపోయాక జన ప్రవాహంలో కొట్టుకొని బయటకు వస్తున్ననాకు రెండో ఆట లైనులో నిలబడ్డ ఒకామెమీద కళ్లుపడ్డాయి అనుకోకుండా. అచ్చు సుజాత లాగే వుంది. కళ్లు పెద్దవిచేసుకొని మరొకసారి చూసేను. సుజాతలాగా ఏమిటి సుజాతే! దాని బారెడు జడ, పెద్ద పెద్ద కళ్లు...... ఎంతటి జనసమర్దంలోనైనా ఇట్టే పోల్చుకోగలిగే రూపం సుజాతది. 'ఉండండి ఇప్పుడే వస్తా!' అని వారికి చెప్పి అటువేపు పరిగెత్తాను. అరె! సుజాత లైనులోపడి ముందుకు పోతోంది. ఒక్కసారి ఇటు చూస్తే బాగుణ్ను. 'యే సుజా! ఇటు...! ఇటు...!' మా సుజాతే.నా పిలుపు వింటూనే ఇటు తిరిగింది. తనూ నాలాగే ముందు ఆశ్చర్యపోయింది. ఆ తరువాత ఆనందించినట్టు తన మొహమే చెప్తోంది.

కొంచెం ముందుకొచ్చి 'ఎన్నాళ్లకిచూశానే విజ్జీ !' అంది ఆప్యాయంగా. 'నువ్వు ఇక్కడికెలా వచ్చావు ?' అన్నాను కొంచెం కుదుటపడ్డా. 'మా వారికి ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ అయింది. రేపు తప్పకుండా రా. హాయిగా రోజంతా మాట్లాడుకుందాము !' అంటూ వాళ్ల ఇంటిఎడ్రసు చెప్పింది. 'వస్తావుకదూ!' అంటూ ఇంటి గుర్తులు మరొకసారి చెప్పి లైనులో ముందుకు సాగిపోయింది.

ఇంటికివచ్చినా సుజాత ఆలోచనలు నన్ను వదల్లేదు. ఆ కొద్ది క్షణాల వ్యవధిలోనే సుజాతలో వచ్చిన మార్పు కనిపెట్టకలిగేను. ఎప్పుడూ, ఎవరి నేడిపిద్దామా, అన్నట్టుండే ఆ అల్లరి కళ్లలో వెతికినా చిలిపితనం కనిపించడంలేదు ఇప్పుడు. చూపుల్లో స్థిరత్వం చోటు చేసుకుంది ! నాకు వున్న స్వేచ్ఛ నాపైటకూ వుంది' అన్నట్టు గాలిలోకి అలా వదిలిపెట్టే పైటకొంగును లక్షణంగా కుడి భుజంమీదికి లాక్కొంది ఇప్పుడు. అలా నిండుగా కప్పుకోడంలో ఒక హుందాతనం ఉట్టిపడుతోంది. అందుకే అంటారుకాబోలు ఆడపిల్లలు, ఎలాంటివాళ్ళూ పెళ్లవగానే ఆరిందాలై పోతారని! వాళ్లాయన ఎలా

## ఎడమచెవి వాటమా మీది!?

కుడి చెవికంటే ఎడమచెవి ఇతర శబ్దాలను శీఘ్రంగా గ్రహిస్తుంది, అని మిషిగన్ యూనివర్శిటీ "స్పీచ్ అండ్ హియరింగ్ సైన్సు" లేబొరేటరీకి చెందిన యాంతోనీ, జె. మురాస్కీ, డొనల్డ్ ■. షార్ప్ అంటున్నారు. మాట్లాడే శబ్దాలను గ్రహించటంలో కుడిచెవి ప్రాధాన్యత వహిస్తుంది. పరిశోధనలు జరుపుతున్నప్పుడు కొందరు వ్యక్తులకు ఒక మాట లేక అక్షరశబ్దాన్ని కలిగించి చూస్తే వారి కుడిచెవి అ శబ్దాన్ని ముందుగా గ్రహించిందట. కాని వివిధ స్థాయిలలో జనించే ఇతర శబ్దాలను ధ్వనింపచేసినప్పుడు వారి ఎడమచెవులే ముందుగా గ్రహించాయట. మెదడులో ఎడమభాగం ఎక్కువ ప్రాధాన్యం వహిస్తుందనటానికి ఇదొక నిదర్శనం అని ఈ పరిశోధకులు సూచిస్తున్నారు. రెండు వాక్ శబ్దాలను ఒకేసారి వినవలసి వచ్చినప్పుడు సర్వసామాన్యంగా అత్యధిక సంఖ్యాకులు 'కుడిచెవి' వారే అనవచ్చు.

వుంటాడో? సినిమాకొచ్చినట్టు లేదు! ఇంత అందం, ఐశ్వర్యం పెట్టి పుట్టిన సుజా ఎలాంటి మొగుణ్ణి ఎంచుకుంటుందో తేలిగ్గా ఊహించొచ్చు. ఔను. ఆ మధ్య ఊరెళ్లినప్పుడు అమ్మ చెప్పిందిగా! సుజాకి సంబంధం కుదిరిందే...వరుడు పెద్ద ఆఫీసర్, వెనక బోలెడు ఆస్తికూడా వుంది. అబ్బాయి బాగుంటాడు కూడానూ' అని. అసలు ఎంతో బాగుంటే తప్ప మా సుజాచేసుకోదనినాకు బాగాతెలుసు.

మర్నాడు ఆదివారం! త్వరగా పనులన్నీ ముగించుకొని సుజాతగారింటికి బయలుదేరాను. 'మీరుకూడా రాకూడదా? ఏం చేస్తారు ఇంట్లో ఒక్కరు కూచోని' అంటే, 'నువ్వెళ్ళొ, నేను మరొకసారి వస్తాలే!' అన్నారాయన.

అసలు సంగతి.'ఆదివారమేనా తనివితీరానిద్రపోవచ్చుకదా రోజంతా'అనిఆయనగారిఉద్దేశం.

నా ఊహ ప్రకారం మంచి ఖరీదైన బంగళా ముందు ఆగాల్సిన రిక్షా, సుజాత ఇచ్చిన ■డ్రసు ప్రకారం ఒక చిన్న డాబా ఇంటిముందు ఆగింది. ఈ యిల్లేనా అని సంశయిస్తూనే గేటు తీసుకొని లోపలికెళ్లాను. వరండాలో ఒకతను ఈజీఛెయిర్‌లో కూర్చుని పేపరు చదువుతున్నాడు. అలికిడి విని పేపరు తొలగించిన ఆ వ్యక్తిని చూసి ఆశ్చర్యంతో అడుగు ముందుకు పడలేదు. అతను అంతకంటె తెల్లబోయి, ఆ వెంటనే తేరుకుంటూ 'నమస్కారం' అన్నాడు నవ్వుతూ. కుర్చీలోంచి త్వరగా లేవాలని ప్రయత్నిస్తున్న అతనికి ఏమాత్రం సహకరించడంలేదు, ఆ అడ్డంతిరిగిన కుడిపాదం.

ఇంతలో సుజా రానే వచ్చింది. తను అందించిన చెయ్యి అందుకుంటూ లోపలికి దారితీసేను.

ఇల్లు చిన్నదైనా పొందికగా నీట్‌గావుంది.

## ఒకరికొకరు వాళ్ళిద్దరూ...

మంచం మీద కూర్చుంటూ 'ఆ వరండాలో కూర్చున్నాయన ఎవరే సుజా?' అన్నాను. ఏ మరిదో అయ్యుంటాడులే అన్నట్టూ!

"ఇంకెవరు? మా శ్రీవారే! పరిచయం చేస్తాను పద" అంది హాయిగా నవ్వుతూ.

'అతను నాకు రోజూ బస్‌స్టాండులో పరిచయమేలే'అన్నాను.లేనినవ్వుతెచ్చుకుంటూ.

నే నూహించిన రంగుల కల మెల్లిగా కరిగిపోతోంది. మనసు ఎట్టెదుట నున్న వాస్తవాన్ని ఒప్పుకోనని మొరాయిస్తోంది. సుజా తప్పు చేసినదానిలా మొహం పెట్టి, 'రిక్షాలో వెళ్లమని ఎంత చెప్పినా వినరేవిజ్జీ! కాలు సరిగా లేనంత మాత్రాన నలుగురిలో కలిసే అర్హత కూడా లేనట్టేనా?' అంటారు అంటూ ఆ వెంటనే 'నువ్వు పుస్తకాలు చూస్తూ వుండు. నేనిప్పుడే వస్తా' అంటూ లేచి వంటింట్లో కెళ్లిపోయింది. దీనికిదేం అలవాటో, ఇంట్లోకూడా నిండా కప్పుకుంటుంది అనుకుంటూ, ఆ పుస్తకాలు అక్కడే పడేసి నేనూ వంటింట్లోకి దారితీసేను. అక్కడ వంటింట్లో జరుగుతున్న దృశ్యం చూసి నా మనసు, శరీరం కూడా కొన్ని క్షణాలపాటు కొయ్యబారిపోయేయి. సుజా కాలి బొటనవేలికింద అగ్గిపెట్టెనొక్కిపెట్టి అగ్గిపుల్ల గీస్తోంది. స్టౌ వెలిగించాలని కాబోలు ఈ ప్రయత్నం అంతా. నన్ను చూడగానే 'అలా గుమ్మాని కతుక్కుపోయావేం? వచ్చి కూచో!' అంటూ పీట చూపించింది.

'సుజా, నీ ఎడంచెయ్యి...' అడగాలనుకున్న మాట గొంతులోనే వుండిపోయింది. ఆ మొండిచెయ్యిని చూడలేక ఒక్కక్షణం గట్టిగా మూసుకున్నా కను రెప్పల్ని దాటి వద్దన్నా వచ్చేస్తున్నాయి కన్నీళ్లు.

సుజా వెనక్కితిరిగి వుందేమో, దాని పొడవైన జడ నేలని తాకుతోంది. ఏదో టిఫిన్ తయారుచేసే ప్రయత్నంలో వున్నట్టుంది. 'ఆ బుట్టలో వుల్లిపాయలు, పచ్చిమిరపకాయలు వున్నాయి. ఓ నాలుగు తరిగిపెట్టు. కత్తిపీట నీ పక్కనే వుంది చూడు!' అంది. ఇటు తిరక్కుండానే. 'సుజా! ఆ ఒక్క చేత్తో ఇప్పుడివన్నీ చెయ్యకపోతే ఏం?' దుఃఖంతో గొంతు నిండిపోయి, మాటలు నోటిలోనే వుండిపోతున్నాయి. మాట్లాడకుండా లేచి ఉల్లిపాయలు తరిగి ఇచ్చేను. సుజాత ఏవో కబుర్లు చెప్తూనే వుంది. 'ఇవాళైతే నువ్వున్నావని మొహమాటం కాని, రోజూ ఈ పనన్నీ ఆయనే చేసిపెడ్తారు. సరేగాని, నిన్న సినిమాలో కలవకపోతే నిన్ను ఎన్నాళ్లకు చూసేదాన్నో కదూ... ఏవిటో అంతా చిత్రంగా అనిపిస్తోంది.'

'ఔను మన బతుకే పెద్ద విచిత్రం' అనుకున్నాను మౌనంగా.

పకోడీలు ప్లేట్లో పెట్టి అందిస్తూ 'ఏమిటలా బొమ్మలా కూర్చుండిపోయేవు? మాటలు మర్చిపోయావా ఏం?' అంది. తను నవ్వుతూ అంటూన్నా కళ్లు మాత్రం శ్రావణ మేఘాల్లా వున్నాయి. 'మేం ఇలా అనుకోకుండా కలసి నందుకు సంతోషంగా వున్నా ఓ విధంగా బాధగాకూడా వుండివుంటుంది. అంతవరకు నన్ను చిత్రవధ చేస్తున్న సందేహాన్ని మరి అదుపులో పెట్టుకోలేకపోయేను. 'నిన్నిలా చూస్తాననుకోలేదు సుజా' అన్నాను గొంతు పెకలించుకొని.

'దేముడు నా కళ్లు తెరిపించాలని చెయ్యి పోగొట్టేడే విజ్జీ' అంది నవ్వడానికి ప్రయత్నిస్తూ.

'ఉండు! కాస్త మా ఆయన సంగతి చూసివస్తా' అంటు అవతలికి వెళ్లివచ్చింది.

'ఆయనగారు నిద్రలో పడ్డారు' అంటూ తను మరో ప్లేటు అందుకొని, ఇప్పుడు

# ఏ పైరుకైనా
# సక్రమమైన పోషణకు–సమృద్ధియైన పంటలకు
# సుఫల 15:15:15 + యూరియా













మార్కెటింగ్ విభాగము

## ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లి.

(కేంద్ర ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

ఆంధ్ర ప్రదేశ్ రీజినల్ ఆఫీస్

5-10-173 ఫతేమైదాన్ రోడ్, హైదరాబాద్-500 004




kiron-FCI-1

చెప్తానుండు అంటూ తీరిగ్గా కూర్చుంది.

'ఆరోజు - అంటే మా పెళ్లి జరగాల్సిన రోజుకి నెల్లాళ్లముందు షాపింగుకని బయలుదేరి తిరిగి వస్తున్నా. మనసు మధురోహల్లో తేలిస్తూ వుంటే ఖర్మ ఇలా కారుకిందకి తోస్తుందనుకోలేదు- షాపు మెట్లుదిగి రిక్షా కోసమని ఇలా నాలుగడుగులు వేసేనోలేదో...

## ఒకరికొకరు: వాళ్ళిద్దరూ...

అంతే! అంతా క్షణాలమీద జరిగిపోయింది. ఈ చెయ్యి తీసెయ్యాలని డాక్టర్లు చెప్పినప్పటికంటే, ఇలా జరిగిందని తెలిసి అబ్బాయి తల్లిదండులు మరో పదివేలు కట్నం పెంచినప్పుడు మాత్రం మొట్టమొదటిసారి నా మీద నాకే జాలేసింది. అక్కడికీ మావాళ్ళు ఆ సంబంధం చెయ్యడానికే సిద్ధపడ్డారు. అబ్బాయి మంచి ఉద్యోగంలో వున్నాడు, అందగాడు అంటూనూ ఘనమైన డబ్బుగలవాళ్ళం కాబట్టి నాలోని లోపాన్ని మరో పదివేలతో కప్పిపుచ్చగలరు. పెళ్ళంటూ జరుపగలరు - కాని ఆడబ్బే లేకపోతే నాగతి... నాకుమాత్రం అలాంటి పెళ్ళి చేసుకోనేకంటే ఇలా ఉండిపోతే నయం అనిపించింది. ఆ సంబంధంతప్పిపోడం, నేనిలా తయారవడంతో నాన్నగారు బెంగతో కుంగిపోయేరు. అమ్మ సంగతి సరేసరి. కానీ విజ్జీ! ఓ గమ్మత్తు చూసేవా? మనం భూమ్మీద పడకముందే దేముడు మన జీవితాలని ఎవరితో ముడిపెట్టి వుంచాలో ముందే నిర్ణయించు కుంటాడు కాబోలు. ఇతను నాన్నగారి ఆఫీసులోనే పని చేస్తూ వుండేవారు. సంగతి తెలిసి తనే స్వయంగా ఈ పెళ్లికి అంగీకరించారు. నాకు అదే న్యాయమనిపించింది. 'మే మిద్దరం ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నాం' కనుక యీ జీవితం సాఫీగా సాగిపోతోంది! అంది తృప్తిగా నవ్వుతూ.

'విజ్జీ మన చిన్నతనం జ్ఞాపకం వుందా! ఈ విషయంలోనే పోట్లాడుకొని రెండేసి రోజులు మాటలు కూడా మానేసేవాళ్ళం. అవి తల్చుకుంటే ఏదోగా వుంటుందిప్పుడు. జీవితం అంటే ఏమిటో తెలీక, కలల్లో తేలిపోయే రోజులవి వాస్తవాన్ని రుచి చూస్తున్న రోజులివి. నువ్వు నమ్మవేమో కాని నాకీ జీవితం చాల తృప్తిగా వుంది. 'బహుశ: ఇప్పటి నా పరిస్థితిని బట్టి' అని నువ్వనుకున్నా అందుకు అభ్యంతరంలేదు. జీవితాన్ని అర్థంచేసుకొని పరిస్థితులలో రాజీపడ్డంలోనే వుందిఅసలు ఏ మనిషికేనా తృప్తి అప్పుడే.'

సుజాతే నాకిలామాట్లాడుతోంది! పోన్లే, ఒకళ్ళ ఓదార్పులవసరపరిస్థితిలో లేదుఇదేచాలు!

నన్ను గేటుదాక సాగనంపుతూ తను చూసిన చూపులు ఎప్పటికీ నా మనసులో అట్టడుగు పొరల్లో ఎక్కడో అలా అలా కదుల్తూనే వుంటాయి. వాటి అర్థం మనం దేన్నయితే ఎక్కువగా ప్రేమించుకొని, తప్పకు తిరగాలని చూస్తామో దాన్నే దేముడు మన జీవితాలకి ముడిపెట్టి 'వీళ్ళు రాజీపడగలరా లేదా' అని చూస్తాడు. "ఏమయితేనేం? నే నోడిపోలేదు' మేమిద్దరం ఒకరి కొకరం చేదోడు వాదోడు సరిజోడు కూడాను" అన్నట్లుగా అనిపించింది.

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**కె. ఎస్. — అయిజ**

ఆంధ్రసచిత్ర వారపత్రిక ఆ మూలాగ్రం చదువు గాని ప్రశ్నావళి శీర్షిక మాత్రం చూడకు అంటారు నా భర్తగారు.

రేపట్నుంచి చదివి వినిపించమనండి— లేకపోతే దొంగతనంగా చదువుతున్నారేమోనన్న అనుమానం పట్టి పీడిస్తూంటుంది మీ వారిని !

**ఎస్. హెచ్. ఆర్. — నల్లూరిపాలెం**

కో—ఎడ్యుకేషన్‌పై మీ అభిప్రాయం ?

అన్ని చోట్లా యిదే వుంటే— యిప్పట్లో — జూలో జంతువులని చూసినట్టు ఆడపిల్లల్ని మగపిల్లలూ మగపిల్లల్ని ఆడపిల్లలూ— పుల్తూపుల్తూ చూసుకోరు !

**డి. బి. ఎస్. — కొత్తపేట**

క్షమించమని అడిగితే క్షమించని మనుషుల నేమనాలి ?

ఏమో— కాస్త చంపేసి క్షమించమంటే. . . ఎలా క్షమించకలరు ?

**ఎస్. డి. ఆర్. — హైదరాబాదు**

సత్‌శీలము సత్‌పౌరుషము ఉన్నవారిని సత్పురుషులు అంటారు. మరి స్త్రీల ప్రవర్తనకి చక్కని బిడియం. . అవసరంకాదా ?

సిగ్గు, బిడియం స్త్రీ సహజమైన సంపదే కాని వ్యక్తిత్వం కావాలనడం— వీటిని వదులుకోవడం అని — ఎవరు చెప్తున్నారు మీకు ? !

**పి. ఆర్. ఎస్. — కొత్తగూడెం**

మీకు అభిమానులకంటే దురభిమానులే ఎక్కువ అని నా అభిప్రాయం ?

నిజమే— అందుకే 'నాదైన ఎనిమీ' అన్న ప్రతి పదికపై. . వుంటాయి నా సమాధానాలు.

**వి. ఎస్. — అల్హాబాదు**

తాను శీలవంతుడు కాకపోయినా శీలవతిఅయిన భార్య కావాలని కోరుకుంటాడు ఎందువల్ల ?

తాము పాటించలేని నైతిక విలువలు ఎదుటివారిపై రుద్దడం— తేలిక కనుక !

**డి. ఎస్. ఆర్. — సిద్దిపేట**

మనిషి ఎప్పుడు తృప్తి పడతాడు ?

తనకుండి ఎదుటి వాడికి లేనప్పుడు ?

**కె. ఎస్. పి. — గంగావతి**

ఇక్కడ పిల్లలకు మాతృభాషా విద్యా బోధన కరువైంది. పత్రికలు వగైరా రావు.... ఇది మా కర్మ ?

కాదు. బద్ధకం. ఎక్కడున్నా తమిళ మళయాళ సోదరులు తమ మాతృభాష పిల్లలు నేర్చుకుందుకని సంఘాలుగా ఏర్పడి ప్రయత్నిస్తారు. మనం అలాకాదే ముగ్గురాంధ్రులకి రెండు సంఘాలు. తెలుగు నేర్పించే ప్రయత్నం జరిగినా ప్రోత్సహించి తమపిల్లలని పంపే పెద్దలు కరువు (ఇక్కడ కూర్చుని తెలుగేం చేసుకుంటాం' అనేస్తారు !)

**ఎస్. కె. — కరీంనగరు**

మీరు రాసినటువంటి చెత్తరచనలు నేను వందరాయగలను.

ఎవరు వద్దంటున్నారు ? ! అచ్చువేసే వాళ్ళా? చదివేవాళ్ళా ?

**జి. ఎస్. ఆర్. — రావివల్స**

మానవుని దానవునిగా మార్చేదేమిటి ?

పరిస్థితులు.

**జె. పి. ఆర్. — రాజమండ్రి.**

కొత్తదనం కోరి కోతివేషాలు వేసేయువతరంపై మీ అభిప్రాయం.

తనదైన ముద్రకి చిహ్నం కొత్తదనం కాదు— ఆత్మవిశ్వాసం అని యింకా తెలియని కుర్రకారు మీద ఉద్దేశప్రకటనలు ఎందుకు.

మీ ఆడవారు వూహల్లో జీవిస్తారెందుకు?

వూహ నిజంకంటే బాగుంటుంది. కనుక!

**కె. జి. పి. — బెంగుళూరు.**

కోతిలోంచి పుట్టాడు మానవుడు అంటే నమ్ముతారా?

నమ్మక తప్పదం లేదు— కొందరు పెద్దల చేష్టలు చూస్తుంటే?

దేవుడు ప్రత్యక్షమై నీకేం కావాలని అడిగితే ఏం కోరుకోను?

గభీలున కోరేయకండి! కైకలాగా కావలసినప్పుడు అడుగుతే యిద్దువుగాని అని అడగడం— ముందు చూపు!

**ఎం. వి. ఆర్. — బూరుగ్గడ్డ.**

జీవితం అంటే?

వడ్డించిన విస్తరి కాదు. శ్రమించిచెమటోడ్చి చేసుకున్న వంట.

**ఒక** అమ్మాయి హోమోస్త్రరు ముస్తాబైంది. మరి. కాలేజీకో, ట్యూటోరియల్ కాలేజీకో — లేక ప్రైవుయిన్‌స్టిట్యూట్‌కో వెళ్తూ వుంటుంది ... వెనుక నించి పాట "అబ్బ! మంగమ్మా? మ వ్ న డు స్తూ ం టే అందం ... "అని ఎవరో తుంటరి కుర్రాడు, ఒంటరి అమ్మాయిని వెంటాడే సన్నివేశం కాదది ... ఉదయంపూట అన్ని దిక్కులా శకటాలు, మనుషులు, పశువులు అన్నిరకాల పట్నవాసపు జీవులు నడిచే నడిరోడ్డు అది... పైగా పాపం! యీ అమ్మాయిని వెంటాడేది "బాకా నోరున్న" శాల్తీయేగాని ప్రాణంలేని శాల్తీ ... అదొక మూడు చక్రాల గూడురిక్షా. 'సినిమా' విడుదలకి ముందు, విడుదలయ్యాకా, అది నడుస్తున్నప్పుడు — వడవక దాని [ అంటే సినిమా తాలూకా అన్నమాట ] డబ్బాలు తిరిగి వెళ్లిపోతున్నప్పుడు ... మ్యాటినీ వేళ, అది లేని

## సామాన్యుని సఖుగుడు

వేళ, ఎండలో—వానలో, దుమ్ములో- ధూళిలో, అలా అలసిపోకుండా సిన్మాపాటలు వాగుతూ పోయే ఆ సైకిల్ రిక్షాని బెజవాడలో, గుడివాడలో, గుంటూరులో మరో ఏలూరులో ఏ వూర్లోనైనా సరే సామాన్య మానవుడు తప్పించుకుపోడం - కష్టం...అలా తప్పించుకు తిరుగువాడు ధన్యుడు. దానికి ముందో లౌడ్ స్పీకర్ — వెనుకో లౌడ్‌స్పీకర్...వుంటాయి. ఎటువేపు మనం నడుస్తూన్నా అది మనల్ని గూబలు గుయ్‌మనేలా తగుల్కొంటుంది... దాన్ని దాటి నడవాలన్నా కష్టమే అది సైకిల్ రిక్షా కదా ... పోనీ దాని వెనుకపడి కాస్త తాపీగా నడిచి పోదామన్నా ... అది యింకా తాపీగా నడుస్తుంది ...

"... అందించు నీ లేత పెదవి ..." అంటుందా రిక్షా నాలుగురోడ్ల జంక్షన్‌లో పంపువద్ద యిళ్లాళ్లు నీళ్లు పట్టుకుంటూ వుంటే ... లేదా "కట్టింది చెంగావికోకా తొడిగింది శనగపూల రవికే" అనో "కౌగిలిలో వుయ్యాలా, లోగిలిలో సయ్యాటా" అంటూ వో జనాన్ని వెంటాడి విజృంభిస్తుంది!

పిల్లకాయలు బడి కెళ్తూంటే, యిది దారికాస్తుంది. ఎక్కడికి పోండి ... బందరు రోడ్డు, ఏలూరురోడ్డు, గాంధీరోడ్డు, బోసు రోడ్డు, ప్రకాశంరోడ్డు అన్ని రోడ్లమీదా ... అప్పుడాలకీ యీ పాటలహోరులో పబ్లిసిటీయే, అగరొత్తులకీ అదే ... సర్కస్‌కి, చిట్ ఫండ్‌కి సినిమాలకి సరేసరి — లాటరీలకైతే కాస్త రిలీఫ్ "కాసేపు టిక్కెట్లమ్మేవాడి పోయిట్రీ అయినా వి న బు ద్దే స్తుం ది. పట్నాల్లో వున్నవాళ్లకి చెవుడు రాదా మరి!

(46 వ పేజీ చూడండి)

## డాక్టర్ సలహాలు

డా. కె. వెంకటేశ్వరరావు

**జి. యస్. — అనంతపురం**

నా వయస్సు 22 సం.లు నాకు నత్తి అప్పుడప్పుడు ఎక్కువగా వచ్చును. నా స్నేహితులు ఎగతాళి చేయుచున్నారు. నత్తిపోవటానికి ఆపరేషన్ గాని లేక ఏదైనా మందుగాని వుంటే తెల్పండి?

మాటలలో స్పష్టత, ఇతరులకు సులభంగా వివరంగా అర్థం వచ్చేటట్లు మాట్లాడ కలగటం పసందు నుంచి క్రమ శిక్షణతో రావలసిన లేకసాధించవలసిన "విద్య" అనే చెప్పాలి. ఎంతోమంది బాగా మాట్లాడ కలిగినా వ్రాతలలో ఆవే భావాలు తెలియ చేయలేక పోవటం, అలాగే బాగా వ్రాయ కలిగినవారు నలుగురిలో మాట్లాడడానికే సిగ్గు పడటం ద్వారా మాటలు తడబడటం మన ప్రపంచంలో ఉన్నారు. ఈ రెండు కూడా సరిగా నిర్వర్తించలేని వారు మన దేశంలో కోకొల్లలు.

నత్తిని ఆపరేషన్ ద్వారా గాక, చిన్న పిల్లలకు మాటలు నేర్పే విధంగా, మొదటి నుంచి, అక్షర ఉచ్ఛారణను, క్రమబద్ధం పద్ధతిలో సాధన చేయటం వాటికి సంబంధించిన కండరాలకు వ్యాయం కలిగించటం మైసూరులో ప్రస్తుతం లభిస్తుంది.

**పి. కె. — రామచంద్రాపురము**

నా వయస్సు 20 సంవత్సరములు. నాకుడి "టెస్టికల్" విడవుదానికంటె మూడింతలు పెద్దదిగా వున్నది. దాదాపు పది సంవత్సరములనుండి ఈ వ్యత్యాసము కన్పించుచున్నది. కారణమేమిటి?

"బీజములు" (టెస్టికిల్స్) వాయటం ఎన్నో కారణాలవల్ల, అయినా ముఖ్యంగా, 'బీజపు' పై పొరలలో నీరువంటి ద్రవం చేరటంవల్ల, లేక దెబ్బతగిలినప్పుడు ఈ పొరలలో నెత్తురుచేరి చివరికి గడ్డ కట్టిపున్నా లేక ఫైలేరియా రోగం ఉన్నప్పుడు, వయస్సు మీరిన వారిలో కేన్సర్, లేక పుట్టుకతో ఏర్పడే కొన్ని రోగాలు మొదలయిన వాటివల్ల జరుగుతుంది.

వీటిలో నెత్తురు నీరు చేరటం, ఫైలేరియాల వల్ల ఎక్కువగా ఈ వాపు వస్తుంది. ఫైలేరియా వలన అయి ఉంటే మాత్రం, నీరు—నెత్తురు చేరి ఉంటే శస్త్ర చికిత్స ఈ రోగం (వాపు) ఉన్నవారికి చికిత్స

**పి. వి. ఆర్ — ఖమ్మం**

నా వయస్సు 30 సం.లు నా మెడ ఎడమ వైపు చిన్న చిన్న బిళ్లలు వున్నవి. గత రెండు సం.లుగా ఆ భాగమంతా నొప్పిగా వున్నది. ఇంజక్షన్లూ మాత్రలు వాడాను. ఫలితము కనపడలేదు. టి. బి. గ్లాండ్సు కావన్నారు. ఇవి రావటానికి గల కారణము వైద్యము తెల్పండి?

మెడమీద బిళ్లలుగా ఉండటం, ముఖ్యంగా అక్కడ ఉన్న లింఫ్ గ్రంథుల (గ్లాండ్స్) వాయటం వలననే అని అనుభవ పూర్వకంగా చెప్పవలసి వస్తోంది. ఇలా వాయటం, టి. బి., హడ్జ్‌కిన్స్ డిసీజ, మొదలయిన వాటివల్ల జరుగుతుంది. ఈ కారణాలు గాకుండా శిరస్సు మీద, గొంతు, ముక్కు, నోరు, చెవులు మొదలయిన వాటిలో చీముగాని, క్రిములు చేరటం వల్ల ఇతర అవలక్షణాలుగాని ఏర్పడినప్పుడు, ఈ గ్రంథులు వాయటం జరుగుతుంది. అయితే ఇలా వాయటం ఆయా రోగం ఉన్నంత కాలం మాత్రమే ఉంటుంది.

మీరు వ్రాసిన విషయాలను పరిశీలించినప్పుడు శస్త్ర వైద్యుల వద్ద హాడ్జ్‌కిన్స్ డిసీజు కొరకు పరిశోధించుకోవటం మంచిదనిపిస్తున్నది. తర్వాత వారి సలహా మేరకు ఎక్స్‌రే ట్రీట్‌మెంట్ లేక శస్త్ర చికిత్స చేయించుకోవటం ఉత్తమం.

**బి. ఆర్. ఆర్. — చిన్నబళ్లాపురము**

నా వయస్సు 17 సంవత్సరాలు. నాకుతరచుగా గొంతు నొప్పి వచ్చుచుండును. డాక్టరు "టాన్సిల్స్ వాచాయన్నారు. ఆపరేషన్ చేయకుండా మందుల వలన నయమవు కాదా?

"టాన్సిల్స్" అనేవి ప్రతి మనిషికీ, ప్రకృతి సిద్ధంగా ఉండేవే. శరీరంలోని రోగ నిరోధక శక్తులలో, ఇవి కూడా ఒకటే అవుతాయి.

ఇవి వాచినవి అనగానే, నిర్మూలించాలి, (ఆపరేషన్ చేయాలి అనటం, అనుకోవటం పరిపాటయి పోయింది.)

వెనువెంటనే, ఎక్కువగా, శరీరానికి బాధ కలిగిస్తున్నప్పుడు, దీర్ఘకాలంగా ఇవి వాస్తూ రావటం జరిగినప్పుడు మాత్రమే, "ఇ. ఎన్. టి." వైద్యులు—పరీక్షచేసి, నిర్ణయించి, ఆపరేషన్ చేయటం జరుగుతుంది.

మామూలుగా వాచినప్పుడు, మాత్రలు, ఇంజక్షన్లు, మాత్రమే వాడటం సర్వసాధారణం.

# "నాకు అత్యుత్తమమైనదే కావాలి-మరొకటి ఏదీ కూడా అవసరం లేదు"

—అంటుంది సుచిత్ర.





# "హార్లిక్స్ వర్షాకాలంలో సంభవించే అనారోగ్యాలు నివారించడంలో సహాయపడ్తుంది."






రోగ నిరోధక శక్తి పెంచి, ప్రతిరోజూ ఆరోగ్యాన్ని కాపాడుతుంది.

వర్షాకాలంలో. శరీరంలో రోగనిరోధక శక్తి తక్కువగా వుంటుంది. దగ్గు, జలుబు, జ్వరం, అజీర్ణం వంటి అనారోగ్యాలు అదపాదడపా కలిగే అవకాశంవుంది. తన కుటుంబాన్ని వీటినుంచి కాపాడటం కోసమూ, పూర్తి వర్షాకాలమంతా తనకుటుంబంలోని వారందరినీ చక్కగా, ఆరోగ్యంగా వుంచటంకోసమూ, సుచిత్ర వీలయినంత మేరకు శ్రద్ధ తీసుకుంటూవుంటుంది. ఆమె, తన కుటుంబంలో అందరూ ప్రతిరోజూ హార్లిక్స్ తీసుకునేట్లు చూస్తుంది.

హార్లిక్స్‌లో జీవనాధార మాంసకృత్తులూ, కార్బొహైడ్రేట్లూ, విటమిన్లూ వున్నాయని డాక్టరు సుచిత్రకి చెప్పారు. ఇవి రోగనిరోధక శక్తిని పెంపొందించి, ఆరోగ్యాన్ని కాపాడతాయి. ముఖ్యంగా వర్షాకాలంలో.

సుచిత్రవంటి తల్లులు హార్లిక్స్‌ని నమ్ముతున్నారు. డాక్టర్లు దాదాపు ఒకవంద సంవత్సరాలనుంచీ హార్లిక్స్ వాడమని సిఫార్సు చేస్తున్నారు. ఒక్క భారతదేశంలోనే కాదు—ప్రపంచవ్యాప్తంగా

## దీనిలో ఆరోగ్యముంది. హార్లిక్స్—మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్క్.

HT-Hx-3749A Tel.

సీరియల్

# జీవనవేదం

పోలాప్రగడ రాజ్యలక్ష్మి

17

(గత సంచిక తరువాయి)

గురుమూర్తిగారి ఇల్లంతా చెప్పలేనంత హడావిడిగా ఉంది. వీధిలో డజన్లకొద్దీ కార్లూ, స్కూటర్లూ ఆగి ఉన్నాయి. ఖరీదైన సూట్లూ, ఖద్దరు లాల్చీలూ, బెనారస్ పట్టుచీరలూ, గుమ్మం దగ్గర కారుల్లోంచి దిగినవి దిగినట్లు డాబా మీదకి వెళ్లిపోతున్నాయి. గురుమూర్తి సింహద్వారం దగ్గర నిలబడి, వస్తూన్న అతిధులందరికీ సరాసరి డాబా మీదకి దారి చూపిస్తున్నాడు. ఆగిన కారులోంచి ఉషా, రాధా దిగడం చూసి నవ్వుతూ "మొత్తంమీద మా రాధ నిన్ను పట్టుకుందే! నీకు ఆహ్వానం అందలేదని తెలిసి పొద్దుటినుంచి తెగ ఆరాటపడిపోతోంది. మా బావమరిది మాధవ్ ఫారిన్‌నుంచి వచ్చాడు కదూ. చిన్న పార్టీ ఎరేంజ్ చేశాం" అన్నాడు.

"రాధ ఇప్పుడే చెబుతోందిలెండి" అంది ఉష.

"నువ్వటు డాబామీదకికాదు. ఇటు లోపలికి. నువ్వు వంటింటి చుట్టానివి కదా? ఈ అరగంటలోనూ మా ఆవిడ అరడజనుసార్లు అడిగింది ఉష వచ్చిందా అని"

"పిన్నిగారికి నేనంటే అభిమానం అండి"

"అవునవును. ఒకఊరి ఆడబడుచులుకదూ?"

ఉష నవ్వుకుంటూ లోపలికి వెళితే, "గెస్టులు ఎవరెవరు వచ్చారో చూసివస్తానంటూ రాధ డాబా మీదకి వెళ్లింది. దేవుడి మందిరందగ్గర దీపం వెలిగిస్తూన్న సీతమ్మ "వచ్చావా ఉషా! ఏవిటింత ఆలస్యం అయింది. అన్నట్టు నీకు ఆహ్వానం అందలేదటగా?" అంది.

"ఆహ్వానం ఎందుకండీ! రాధే స్వయంగా వచ్చింది" అని ఉష సమాధానం చెబుతూన్న సమయంలో "అక్కయ్యా– మరేమోను..." అంటూ కొంచెం యాస తెలుగులో మాట్లాడుతూ అక్కడికి రాబోయి, వెంటనే కొత్త వ్యక్తి ఎవరో ఉన్నారని సందేహించి గుమ్మందగ్గరే ఆగిపోయాడు మాధవ్.

ఏ ఆభరణాలూ లేకపోయినా, రాళ్ల నెక్లెసులూ, రత్నాలు పొదిగిన గాజులూ ఉన్నట్టు మెడా చేతులూ తళుక్కుమంటూంటే, జడలో తురుముకొన్న జంట గులాబీ, కనుబొమలమధ్య దిద్దుకున్న చిన్న తిలకంబొట్టూ, వెయ్యి అలంకారాలుగా వెలిగిపోతూంటే, తెల్ల కేలీ సిల్కు చీరలో మెరిసిపోతూన్న ఉష, ప్రత్యేకం వంటింట్లో పెట్టిన మణిదీపమా అన్నట్లు, జిగేల్‌మంటూ కన్పించింది మాధవ్‌కి.

నల్లని గిరిజాలులా పెంచిన జుట్టూ, చెవుల దాకా అందంగా పెంచిన సైడ్ లాక్సూ, కళ్ళల్లోనూ ముఖంలోనూ కొట్టవచ్చినట్లు కనిపిస్తూన్న చైతన్యం, ఆకుపచ్చని ఫుల్ సూటులో పసుపుపచ్చగా మెరిసిపోతూన్న పాతికేళ్ళ యౌవనంలా కన్పించాడు మాధవ్ ఉష కళ్ళకి.

అలా ఒకళ్ళ నొకళ్ళు ఎన్నాళ్ళకి చూసుకున్నాం అన్నట్లు తెల్లబోయి చూస్తూ ఉండిపోయిన ఉషనీ మాధవ్‌నీ చూసి సీతమ్మ పకపకా నవ్వి "అదేవిట్రా ఫొటో తీసినట్టు అలా ఉండిపోయారు! వీడే మా తమ్ముడు మాధవ్... ఈ అమ్మాయి ఉషరా... మన ఊళ్ళో భద్రయ్యగారని చెబుతూ ఉంటాను జ్ఞాపకం ఉందా? వాళ్ళమ్మాయి" అంది.

నమస్కారం చేసిన ఉష చేతులు ఆ మట్టునే ఉండిపోయాయి. మాధవ్ "నమస్కారమండీ!" అన్నాడు మర్యాదగా 'స' అనే అక్షరాన్ని 'ష' లా పలుకుతూ.

"అండీ అంటావేమిట్రా!... ఉష నీకంటే రెండు మూడేండ్లు చిన్న" అంది సీతమ్మ మందలిస్తూ.

"అదేవిటి? కొత్తవాళ్ళని నువ్వు అని ఎలా అంటాం పెద్ద పరిచయమున్నట్లు?... నువ్వు మరీను" – మాధవ్ ప్రతి అక్షరాన్నీ ఆపి ఆపి మరీ అంటూంటే ఉషకి నవ్వు వచ్చింది.

"నా తెలుగు ఉచ్చారణ అంత బాగోలేదు కదండీ! శుభ్రమైన తెలుగు, ఇంగ్లీషు ఉచ్చారణలో పడి ఇలా అయింది."

"ఫరవాలేదులెండి. అదీ ఓ రకంగా బాగానే ఉంటుంది."

"అయితే మీరు మా రాధ లాగ చెవులు మూసుకోరన్న మాట నేను మాట్లాడుతూంటే!... మీరుకూడా తెలుగు ఎమ్మే కాదా?"

"కాదురా... ఆ అమ్మాయి ఎమ్. బి. బి. యస్. పూర్తి అయిపోవచ్చింది కూడా" అంది సీతమ్మ.

ఇంతలో రాధ "నాన్నగారు అందర్నీ పైకి రమ్మంటున్నారు... ముఖ్యంగా మావయ్యా నిన్ను! గెస్ట్‌లకి పరిచయం చెయ్యాలట... రా ఉషా డాబా మీదకి పోదాం" అంటూ వంటింట్లోకి వచ్చి హడావిడి చెయ్యసాగింది.

"నువ్వెందుకు రాధా డాబామీదికి? అక్కడ మరీ గాలి ఎక్కువ–అసలే నువ్వు ఉఫ్‌అంటే ఎగిరిపోతావు" అన్నాడు మాధవ్ నవ్వుతూ...ఉషకి నవ్వు వచ్చింది. "నిజమే. రాధ మరీసన్నం. చేతికర్రకి చీరచుట్టబెట్టినట్లుంటుంది" అనుకొంది మనస్సులో –

మాధవ్‌అన్నమాటకి రాధకి పౌరుషం వచ్చింది. "నేను సన్నంగాఉంటే ఏంలే? ఇద్దరికీ సరిపడ నువ్వు ఉన్నావుగా లావుగా పైల్వాన్‌లాగ" అంది ...

"చూశావా ఉషా! ఇదీ వరస! ఒక్కక్షణం ఇద్దరికీ పడదు" అంది సీతమ్మ.

నలుగురూ నవ్వుకుంటూ డాబామీదకి వెళ్ళారు.

డాబామీద ఆడవాళ్ళంతా ఓ పక్కని నిలబడ్డారు.

మగాళ్ళంతా ఇంకోపక్కని ఉన్నారు.

అందరి చేతుల్లోనూ ఫలహారాలున్న పేపర్ ప్లేట్సున్నాయి. అందరూ ఎవరిమట్టుకి వాళ్ళు పక్కవాళ్ళతో మాట్లాడుతూఉన్నారు. గురుమూర్తి మాధవ్‌ని మగవాళ్ళకందరికీ పరిచయం చేస్తున్నాడు. అందరి అభివందనలనీ కృతజ్ఞతతో అందుకుంటూ కదులుతూఉన్నా, మాధవ్ చూపులుమాత్రం ఉష మీంచి కదలకుండానే ఉన్నాయి. అతనిచూపులు తన చూపుల్తో కలిసినప్పుడు ఉష సిగ్గుతో తలవంచుకుంటోంది. ముదిరిన వయస్సుతో బాధ్యతలున్న ప్రభాకరం భారమైన చూపుల్తో పోలిస్తే ఇతని కళ్ళు ఎంతచలాకీగా ఉన్నాయి" అనుకొంది ఉష.

అతిధులకబుర్లూ నవ్వులూ మధ్య, టేప్‌రికార్డర్‌లోంచి సన్నగా మత్తుగా పాప్ మ్యూజిక్ వినిపిస్తోంది. ఆ మ్యూజిక్ మనస్సుకేదో హాయిని కలిగిస్తూంటే, మైమరిచి వింటోంది ఉష.

ఇంతలో పక్కనుంచి గుడ్లగూబ కూతలా విని

**జరిగిన కథ 11 :** భద్రయ్యగారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్యగారి ఆస్తంతా దానధర్మాలతో హరించిపోయింది. భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు. ఉషని చెరచ ప్రయత్నిస్తాడు అంకరాజు. భద్రయ్యగారు మరణిస్తారు. ఢిల్లీ చిత్ర కళా ప్రదర్శనలో బహుమతి సంపాదిస్తాడు మురళి. ఉషని మద్రాసులోని ఆంధ్ర మహిళా సభలో చేర్పిస్తాడు ప్రభాకరం. దొడ్డమ్మ జోగమ్మగార్ని చూడాలని వస్తుంది లీల. మురళితో కలసి విహార యాత్రలకి బయల్దేరుతుంది లీల. పెళ్లనే తంతు లేకుండానే దంపతు లౌతారు లీల మురళిలు. మెడిసిన్ పూర్తయ్యాకే పెళ్లి అన్న ప్రభాకరం అంటే యేవగింపు కలుగుతుంది ఉషకి. లీల మురళిలను చూడాలని వచ్చిన ఉష, ప్రభాకరాన్ని కలుస్తుంది. ప్రమాదవశాత్తు మేడమీదనుంచి పడిన జోగమ్మగారి వెన్నెముక దెబ్బతింటుంది. ప్రభాకరం సహాయాన్ని తిరస్కరిస్తుంది ఉష. తల్లి కాబోతున్న లీల, తండ్రిని చూడటానికి బయల్దేరుతుంది.

పించింది. ఒక మొరటుకంఠం "నువ్వు భద్రయ్య గారి కూతురువి కదూ ?" అంటూ. అదిరిపడి పక్కకి చూసింది ఉష.

అంకరాజు !

"ఇక్కడికొచ్చిందేవిటి ఈ పీడకల !"— ఉష భయంతో నిలువెల్లా వణికిపోయింది. ఆమెకళ్ళల్లో కనిపించిన ఆందోళనచూచి వెంటనే పక్కనిఉన్న రాధ చట్టున జోక్యం చేసుకుంటూ" "అవును... ఏం ?" అంటూ మొరాయించింది.

రాధ కంఠంలో తీవ్రతని గమనించి, అంక రాజు కొంచెం తగ్గి "అబ్బే ... మందీ ఆఉరేలే !" అన్నాడు.........

"మంది అంటే మీదీ నాదీనా ?"

"అహహ...నాది...అవును...ఉషా ! ...ఇక్కడ ఏం చేస్తున్నావు ? చదువా ఉద్యోగమా ? ఆ మధ్యన అయిదారేళ్ళక్రితం మెడ్రాస్‌లో కాదూ కనిపించావు"

అతనితో మాట్లాడటానికి అసహ్యంవేసి జవాబు చెప్పకుండా ముఖంపక్కకి తిప్పుకుంది ఉష. ఉషపడుతున్న ఇబ్బందిని నలుగురు మనుష్యుల అవ తలనుంచున్న మాధవ్ గమనించాడు. అంకరాజుని చూస్తే ఖరీదైనబట్టలే తొడుక్కున్నాడు కాని, ఆ ఖరీదుకి తగ్గ సంస్కారం ఏదీ మనిషిలో కన్పిం చక ఆ బట్టలతనికి ఎబ్బెట్టుగా కనిపించాయి. ఉషకి అతనితో మాట్లాడ్డానికి ఇష్టం ఉన్నట్లులేదు ... అతనుమాత్రం ఆమెని వదిలేలా లేడు. ఉషని ఆ ఇబ్బందిలోంచి తప్పించాలనే ఉద్దేశంతో మాధవ్ అంకరాజుదగ్గిరికివచ్చి, సూటిగా అతనికేసి వేలు చూపిస్తూ "మీ...రు...?" అన్నాడు.

అంకరాజు తబ్బిబ్బుపడి "నేను ...జె. యం. జె. కంపెనీ మేనేజరు బావమరిదిని. పార్టీకి అతను రాలేకపోతే నన్ను పంపాడు" అన్నాడు.

"ఓహో...అలాగా? మీరేం చేస్తుంటారు?" అన్నాడు గట్టిగా గర్జిస్తూ మాధవ్. అతనికంఠం విని డాబామీదఉన్న వాళ్ళంతా దాదాపు నిశ్శబ్దంగా అయిపోయి వాళ్ళకేసే చూస్తూ ఉండిపోయారు.

"నేను సినిమా నిర్మాతనండీ! మాది మద్రాసు, దెబ్బకి దెబ్బ ...కదిలితే తంతా..." అని ఆగాడు ఉష అతనికేసి ఆశ్చర్యంగా చూసింది వీడు నిర్మాత ఎప్పుడయ్యాడా అని. వెంటనే అంకరాజు ఆమెకేసి తిరిగి "నిన్నే పెళ్ళాడతా..." అనేసరికి అంతా ఘొల్లున నవ్వారు. ఉష అవమానంతో కుంచించుకు పోవడాన్ని చూసి మాధవ్, అంకరాజు మొహంమీదకి వచ్చి..."మొదలైన సినిమాలు తీశారన్నమాట. చాలా సంతోషం. కాని ఇది ఆడవాళ్ళునుంచున్న స్థలం. మనం అలా మగాళ్ళలోకి వెళదాంరండి" అంటూ అతని సమాధానంకోసం అయినా ఆగకుండా జబ్బ పట్టుకుని దూరంగా తీసుకుపోయాడు.

"బ్రతుకుజీవుడా !...మాధవ్ ధర్మమా అని ఈగ్రహం తప్పింది ... లేకపోతే ఇంకేం మాట్లా డుతూ ఉండేవాడో...అయినా శాపంలా తన జీవి తానికి వీడేవిటి ?" అనుకుంది ఉష. సమయానికి వచ్చి తెలివిగా అంకరాజుని నోరుమూయించి ఇక్కడ నుంచి మాధవ్ తీసుకుపోయాడు కాని లేకపోతే వాడి మూలంగా తనెంతో చులకనఅయిపోయి ఇంతమంది లోనూ అవమానం పొందవలసి వచ్చేది.

మాధవ్‌పట్ల కృతజ్ఞతతో ఉషహృదయం నిండి పోయింది. వచ్చిన అతిథులు ఒక్కొక్కరే మాధవ్‌ని మళ్ళీ ఇంకోమారు అభినందించి వెళ్ళిపోసాగారు. ఇంకో అరగంట పొద్దు ఉంది. "ఇంక నేనూ వెళ్తా నండి" అంటూ ఉష సీతమ్మదగ్గరా గురుమూర్తి దగ్గరా శలవు తీసుకుంటున్న సమయంలో మాధవ్ అక్కడికి వచ్చి "అప్పుడే వెళుతున్నారా?" అన్నాడు. ఆ పలకరింపులో ఇంకొంచెంసేపు ఉండకూడదూ అన్న ప్రార్థన ధ్వనించి, ఉష పెదవులమీద చిరు నవ్వు మెరిసింది ..

"అవునండీ ! ... అసలు మనస్సేం బాగోలేక బీచ్‌కని బయలుదేరితే మధ్యలో రాధ అటకాయించి ఇలా తీసుకువచ్చింది ..."

"బీచ్‌కా ? అయితే పదండి. నేనూ వస్తా."

"నేనూ వస్తా" అంది రాధ.

"నువ్వు లేకుండానా ?... పద కారెక్కు" అన్నాడు మాధవ్.

"ఇప్పుడు నేను బీచ్‌కి రానండీ హాస్టల్‌కి వెళ్ళిపోతా" అందాం అనుకుంది ఉష. కాని స్టీరింగ్ దగ్గర కూర్చుని కళ్ళతో 'రండి' అని మాధవ్ పిల్చినప్పుడు, ఇందాకటి కృతజ్ఞత మనస్సులో మెదిలి కాదనలేకపోయింది.

మాధవ్ ఉషా ఇసుకలో కొంచెం ఎడం ఎడంగా కూర్చున్నారు. రాధ మాత్రం, నీటి దగ్గరికి వెళ్ళి, కెరటం వచ్చి వెళ్ళిపోయిన తడి ఇసుకని పాదాలతో అదుముతూ, అంతమేరా తేమ తప్పుకొని, ఇసుక చిన్న కాంతివలయంలా అవుతూ ఉంటే, దాన్ని తమాషాగా చూస్తూ సముద్రంవారనే అడుగులు వేసుకుంటూ నడుస్తోంది.

సముద్రం గాలి హోరున వీస్తూ, ఉష గుండెల మీద పైటని ఉండనియ్యడంలేదు. మహా ప్రయాసతో పైటని రెండు బుజాల మీంచీ తిప్పు కుని, నిండుగా కప్పుకోడానికి ప్రయత్నిస్తూన్న ఉషని కన్ను లార్పకుండా చూస్తున్నాడు మాధవ్... అతని చూపులు వచ్చి హృదయానికి గుచ్చుకున్నట్లయింది... తన అందాలు అతని కళ్ళ ఎక్కడ పడతాయో అని తత్తరపాటుతో సిగ్గు పడుతోంది ఉష...

సూర్యాస్తమయం కాబోతోంది.

లోకం ప్రభాకరుని ప్రభావం నుంచి తప్పుకుని అప్పుడే ఉదయించబోతూన్న సుధాకరుని పాలనలోకి అడుగు పెట్టబోతోంది... తూర్పు పడమరలతో సహా మొత్తం ఆకాశం అంతా రాగరంజితం అయింది... ఉషకి తను వెనక చూసిన సంధ్యా సమయం, మురళిని ప్రోత్సహించి వేయించిన సంధ్యా



దేవి కళ్యాణ వేదిక చిత్రం జ్ఞాపకం వచ్చి, పట్టరాని ఆనందంతో వళ్ళు ఒక్కమారు జలదరించింది.

"అదేవిటి అలా ఉన్నట్టుండి ఒక్కమాటు వణికిపోయారు ?" అంటూ, చటుక్కున ఆమె జబ్బ పట్టుకుని అనునయించబోయాడు మాధవ్. కాని అతనికి వెంటనే ఇది ఇండియా, యూరోప్ కాదని జ్ఞాపకం వచ్చి, "సారీ!" అంటూ ఆమె చెయ్యి వదిలేశాడు.

అతని స్పర్శ, తగిలింది ఒక్క త్రుటికాలమే అయినా, అదే ఎన్నో జన్మల నుంచి తనకి అనుభవంలో ఉన్నట్లు ఉలిక్కిపడి, ఉష ఆ పరవశత్వం నుంచి ఎంతసేపటికో కాని కోలుకోలేకపోయింది. సముద్రంలోంచి ఉదయిస్తూన్న చంద్రుడు, అందంగా నీటి కెరటాల మీద కదులుతూ ఆడుకుంటూన్న తన ప్రతిబింబాన్ని చూసి, నవ్వుకుంటున్నాడు. ఊగే అద్దాల మధ్య కూర్చుని, వళ్ళు విరుచుకుంటూ పక పకా నవ్వుతూన్న వెండికొట్టులా ఉంది సముద్రం. అందాల అంచుల్ని దాటి ఇంకా ఎక్కడికో తీసుకుపోతూన్న ప్రకృతిని చూస్తూ, శరీరం, మనస్సూ, హృదయం, అసలు తన అస్తిత్వమే, ఆనందంలా కరిగిపోతూంటే అచేతనంగా కూర్చుండిపోయింది ఉష.

ప్రకృతినిచూసి ఆమె పులకిస్తూంటే, ఆమెని చూస్తూ తనని తాను మరిచిపోసాగాడు మాధవ్ ...

రాధ ఇంకా సముద్రంతో ఆడుకుంటూనే ఉంది.

వెన్నెలపడి ఎదురుగుండా ఉన్న సముద్రం అంతా పాలసముద్రంలా కనిపించింది ఉషకి ... వీస్తూన్నగాలికి కల్లోలితం అవుతూన్న ఆపాల సముద్రం, ప్రభాకరం రేకెత్తించిన కాంక్షలకి సంక్షుభితం అవుతూన్న తనహృదయంలా తోచింది. గాలికి జాలిలేదు...ప్రభాకరంలాగే ఎంతో నిర్దయగా ప్రవర్తిస్తోంది...పాపం సముద్రం కలగుండు పడిపోతోంది. తాళలేకపోతోంది...తనని తాను మధించుకుంటోంది...

గాలి ప్రభాకరంలా...సముద్రం తనలా...

ఏకమధనపడిపోతోంది ...... కవ్వం పెట్టి చిలికినట్లు ఒకటే ఆందోళన...గుండెలనిండా ... మనస్సునిండా...మెదడునిండా ఒకటేసంక్షోభం ... కదిలిపోతోంది...ఊగిపోతోంది...తిరిగి పోతోంది... చిలికేస్తున్నట్లు...గుండెల్ని కవ్వంపెట్టి చిలికేస్తున్నట్లు...బాధ...వేదన...ఆందోళన...గిరగిరా...గిరగిరా...తిరిగిపోతూన్న హృదయం ... కలిగిపోతూన్న హృదయం...మరిగిపోతూన్న హృదయం ... మండిపోతూన్న హృదయం ... క్షీరసాగరమధనం సాగిపోతోంది... ఉత్తాలతాలంగా, మహోజ్జ్వలంగా, మహాభయంకరంగా, అలా తిరిగి తిరిగి తిరిగి తిరిగి భయంకరమైనశబ్దంతో ఆగిపోయింది ...

వెన్నముద్దలాంటి ప్రేమఫలం జాబిల్లిలా పైకెగిరిపోయింది.

"ఎంతపని చేశావు ప్రభాకరం !" అంటూ ఒక్క అరుపు అరిచి ఉష ఒరిగిపోయింది...

పడిపోతూన్న ఉషని కంగారుపడుతూ మాధవ్ పట్టుకున్నాడు.

రాధకూడా పరిగెట్టుకుంటూ వచ్చింది...

స్పృహ కోల్పోయిన ఉష ముఖంమీద సోడానీళ్ళు జల్లి, కొంచెం తెలివివచ్చి ఆమె కళ్ళు తెరిచాక, రాధా మాధవ్‌లు ఇద్దరూ ఆమెని చెరోవైపునా పట్టుకుని కారుదాకా నడిపించుకొని వెళ్ళి ఇంటికి తీసికెళ్ళారు.

ఇంకో గంటకి ఉష పూర్తిగా తేరుకుంది.

మామూలుగా మాట్లాడింది.

ఏం జరగనట్లు నవ్వుతూ కబుర్లుచెప్పసాగింది.

మాధవ్ పెద్దభారం తీరినట్లు 'హమ్మయ్య' అని నిట్టూర్చాడు.

కాని అతని మనస్సులో పెద్ద ప్రశ్నార్థకం మిగిలిపోయింది...

ఇందాకా ఉష స్పృహ కోల్పోతూ అరిచిందే— ఆ ప్రభాకరం ఎవరు ?

## 18

"ప్రభాకరం ఎవరంటే ఏం చెప్పమంటారు ? నా జీవితంతో మీరింత సన్నిహితంగా అయిపోయారు కనుక, నా గురించి ఇంత ఆందోళన పడుతూ ఆత్మీయంగా అడుగుతున్నారు కనుక, మొదటినుంచీ నా కథ అంతా క్లుప్తంగా చెప్తాను. చివరిదాకా విని మీరే నిర్ణయం చెయ్యండి ప్రభాకరం ఎవరో— నాకు ఏం అవుతాడో— అతనికీ నాకూ మధ్యన ఉన్న అనుబంధం ఏవిటో" అంటూ ఉష వెళ్ళి రేడియో కట్టేసి వచ్చి ఈజీ ఛైర్‌లో కూర్చుని, దూరాన్ని ఉన్న పేరాపెట్‌వాల్ మీంచి జారిపోతూన్న నీరెండని చూస్తూ, తన కథ మొదలుపెట్టింది.

మాధవ్ కుర్చీలో ముందుకి వంగి కూర్చుని, రెండు చెంపల్నీ చేతుల మధ్య ఉంచి ఎంతో శ్రద్ధగా, మరెంతో సానుభూతిగా, ఆమె చెప్పేది అంతా వినసాగాడు. అంతా విని నిట్టూరుస్తూ "ఈ ప్రభాకరం చాలా చిత్రమైన వ్యక్తిలా ఉన్నాడే! మీరు చెప్పినదాన్నిబట్టి చూస్తే మిమ్మల్ని గాఢంగా ప్రేమిస్తున్నట్లే కనిపిస్తోంది. మరి అంతగా ప్రేమించిన వ్యక్తి, మీరు కోరగానే వెంటనే పెళ్లి చేసికొని ఉండాలి. ఎందుకు ఆలశ్యం చేస్తున్నాడు చెప్మా... మెడిసన్ పూర్తి అయ్యేదాకా చేసుకోను అనడం వట్టి అర్థంలేని మాట!... అటువంటి షరతు ఏవైనా పెడితే మీరు పెట్టాలి . తనేవిటి?... ఈ చదువు మీకంటే అతనికి ఎక్కువ అవసరమా?... బహుశా మీరుకూడా ఎమ్. బి. బి. యస్. చేసేయితే తన ప్రాక్టీసు కొంచెం ఎక్కువయి పెద్దది అవుతుందనేమో..."

"ఆ ఇబ్బంది యేం లేదు... ఇప్పటికే అతనికి తల మునకలుగా ప్రాక్టీసు ఉంది. పైగా అతను ఇంతకుముందే పెద్ద శ్రీమంతుడు... అయినా అతను డబ్బుకి అంత ప్రాధాన్యం ఇచ్చే వ్యక్తి కాదు."

"మనిషి ఖచ్చితమైన వాడేనా ?"

"ఆహా... నూటికి నూరు పాళ్ళూ"

"అయితే తమాషాగా మీ జీవితంతో ఆటలాడుకుంటూ మోసం చేస్తాడనడానికి తావు లేదు."

"ఉహుం!... వీసం అంతయినా..."

"మీ చదువువల్ల అతనికి లాభం లేదు... అయినా మీరు చదువుకోవాలని పట్టుబడుతున్నాడు... ఆ తర్వాతే పెళ్లి చేసుకుంటానని అంటాడు... పోనీ ఆ తర్వాతయినా చేసుకుంటానని వాగ్దానం చేశాడా ?"

**గాజు**

"వాగ్దానం లాంటిది ఏం చెయ్యలేదు ...... కానయితే పెళ్లి చేసుకుంటానన్నట్లే ప్రవర్తిస్తున్నాడు."

"చేసుకొనేవాడు వాగ్దానం చెయ్యడానికేం ?"

"ఆఫ్‌కోర్స్... ఆ ప్రస్తావన ఎప్పుడూ మా మధ్య రాలేదనుకోండి... నేనూ అడగలేదు వాగ్దానం చెయ్యమని."

"ఆడవాళ్ళయి మీరెలాగ అడుగుతారు అంత సూటిగా ?... అతనే, మాటిచ్చి ఉండవలసింది మీ ఆందోళన చూసి."

"ఈ మాధవ్ ఎంత చక్కగా అర్థం చేసుకున్నాడు స్త్రీహృదయం...ప్రభాకరానికి ఇతనిలో సగం అర్థం చేసుకొనే శక్తి ఉన్నా తనజీవితం ఇంత సందిగ్ధంగా ఉండకపోను" అనుకొంది ఉష.

"పోనీ ...ఏ...మీ అన్నయ్యలాంటి మధ్యవర్తి అడిగితేనో 'ఏమయ్యా ఇంతకీ నువ్వు ఇప్పుడు కాకపోతే రెండేళ్ళ తర్వాతయినా ఉషని పెళ్ళిచేసుకోనేది ఉందా లేదా?' అని. దాంతో సంగతి తేలిపోతుంది"

ఉష నీరసంగా నవ్వి "మీకు ప్రభాకరం తత్వం తెలియదు...అతను ఏ సంగతీ పూర్తిగా తేలనివ్వడు...అతని అభిప్రాయం ఏదో తేలదు ... చాలా లోతైనమనిషి"

"మనిషి మంచివాడే అంటున్నారు ... డబ్బు బెంగలేనివాడంటున్నారు... పెళ్ళి చేసుకుంటానన్నట్లే ప్రవర్తిస్తున్నాడు కాని వాగ్దానాలు ఏమీ చెయ్యలేదంటున్నారు ... అలాంటివాడు నిజానికి మీలాంటి అందమైన అమ్మాయి ఎక్కడ తప్పిపోతుందో అని తెగ కంగారుపడి వెంటనే పెళ్ళి చేసేసుకుని ఉండాలే...చూస్తే ఆ తొందరేం అతనిలో కనిపించడంలేదు ... మిమ్మల్ని గాఢంగా ప్రేమించే ఉంటాడు కాని, పెళ్ళిచేసుకోడానికి వీలులేని ఏ యిరకాటంలోనో పడ్డాడేమో ...బై...ది...బై...వాళ్ళమ్మకి మీరంటే ఇష్టమేనా ? డబ్బులేనివాళ్ళంటూ పెద్దవాళ్లకి ఉండే పాత చాదస్తాలేమైనా ఉన్నాయా ?"

"అబ్బే...ఆమె నన్ను ప్రాణంలా చూసుకుంటుంది."

"పోనీ అతను మరొక అమ్మాయికి ఎవరికేనా మాట ఇచ్చాడేమో"

## మినీ

శాతవాహన కాలేజీ విజయవాడ బి. కామ్. విద్యార్థి శనగసెట్టి దుర్గాప్రసాద్, 1973 లో కాలేజీ తెలుగు వ్యాసరచన పోటీలలో బహుమతి అందుకున్నాడు. "క్విజ్" పోటీలలో పాల్గొనడం సరదా. ప్రయిజులుకూడా కొట్టాడు. "లియో" క్లబ్‌లో ఏక్టివ్ మెంబర్. సాంఘిక చిత్రాలు చూస్తాడు. ఎప్పుడేనా ఇంగ్లీష్ బయిస్కోపులుకూడా చూస్తాడు. క్రికెట్ ఆటంటే ఇష్టం. దానికోసం చాలాదూరం అయినా స్టేడియంకి వెళ్తాడు. సినిమా తారల్ని చూడాలని, మంత్రులను కలవాలని, సరదాలేని

**మేడ**

ఉష ఉలిక్కిపడింది.

"అతనికి సన్నిహితంగా ఉండే అమ్మాయిలు ఎవరేనా ఉన్నారా ?"

"ఉహూఁ! ఎవరూలేరు...అఫ్‌కోర్సు...అతనికి అసిస్టెంట్ చేస్తూ అతనిదగ్గర పనిచేస్తూన్న డాక్టరు జానీ ఉంది"

"ఆమెకి పెళ్ళయిందా ?"

"లేదు..."

"ఎలా ఉంటుంది ? ఆ జానీ అందంగానే ఉంటుందా"

"అందంఅంటే...అదే...ఫరవాలేదు...అందంగానే ఉంటుంది... అందమైనదానిలోనే లెఖ్ఖ..."

"ఇంకేం ?" సమస్య చాలావరకూ అర్థంఅయిపోయింది...ఊ...అతని సంగతి అలా వదిలెయ్యండి. ఇంక మీ విషయం చెప్పండి"

ఉష అదిరిపడి బెదురుతూ మాధవ్ కేసి చూసింది...

"ఇలా మిమ్మల్ని డైరెక్ట్‌గా అడగడం మేనర్స్ కాదనుకోండి..." తటపటాయిస్తూ కాస్సేపుఆగాడు మాధవ్. ఉషకి ఆ పరిస్థితి ఏదో ఇబ్బందిగా అనిపించి ఇంతటితో ఈ ప్రస్తావన ఆపేస్తే బాగుండుననిపించింది.

"ఇది మీకో పెద్ద సమస్య అయిపోయి, ఎటూ తేలక, ఎటూ నిర్ణయం కాక, మనస్సులో అంతులేని ఆందోళనగా తయారు కావడంవల్ల, కేవలం ఒక మిత్రుడుగా దీన్ని కుణ్ణంగా చర్చించి మీ మనస్సుకి కొంత రిలీఫ్ ఇద్దాం అనే ఉద్దేశంతో నేనింత పట్టుబట్టి వివరాలన్నీ అడుగుతున్నాను... ఏం అనుకోకండి... అభ్యంతరం లేకపోతేనే చెప్పండి... మరీ పెర్సనల్ అయితే వద్దు, చెప్పొద్దు."

అతనంత ఆత్మీయంగా మాట్లాడుతున్నప్పుడు, జవాబు చెప్పకుండా లేచి వెళ్లిపోవడం, సభ్యతగా ఉండదని, కుర్చీలోంచి లేచిందే మళ్లీ కూర్చుంది ఉష.

"ప్రభాకరం మిమ్మల్ని ప్రేమిస్తున్నాడో, పెళ్లి చేసుకుంటాడో, చేసుకోడో, అవి అన్నీ అలా ఉంచండి... అసలు ఇప్పుడు మీ మనస్సు ఎలా ఉంది ?... అతణ్ణి చేసుకోవాలని ఉందా ?"

సూటిగా మాధవ్ అలాంటి ప్రశ్న వేసేటప్పటికి ఉష తెల్లబోయింది... చాలాసేపు తబ్బిబ్బుపడింది... ఏదో చెప్పబోయింది... చివరకి ఏదీ చెప్పకుండా ఊరుకుంది...

"మొదట్లో అతణ్ణే పెళ్లి చేసుకోవాలని బలంగా అనుకున్నారనుకోండి... మెడిసిన్ చదవడం మానేసి కూడా పెళ్లి చేసుకోవడానికి సిద్ధపడ్డారు... ఆ అర్థం వచ్చేలాగ అతనికి చెప్పారుకూడా... కాని అతనేం వినిపించుకోలేదు...మరి, ఆ తర్వాత అలాగే ఉందా ?... అ... ఇతణ్ణే చేసుకోనేదేవిటిపోనిద్దూ అంటూ, ఆ పాత కోరికని తగ్గించుకున్నారా ?"

"ఇతనేవిటి ? మనస్సులోవున్న భావాలు చదివేస్తున్నట్టున్నాడు" అని భయపడింది ఉష...

"ప్రభాకరం అంటే మీరింకా ఇష్టపడుతూనే ఉన్నారు. అవునా ?"

అవునని ఉష అనలేదు.

"ఈప్రశ్న మరీ పెర్సనల్‌గా ఉందేమో ... పోనీ మానెయ్యండి...ఇంకోటి అడుగుతాను."

ఉష కంగారుగా "అదికాదు ... పెంచుకొన్న మమతని తెంచుకోవడం చాలాకష్టం..." అంది తల వంచుకొని...

"ఎగ్జాట్లీ ... అసలు ఉన్న చిక్కుఅంతా అక్కడేవుంది మనుష్యుల్లో...మమతల్ని తెంచుకోలేం, ఉంచుకోలేం! అదే మనిషిబలమూ, బలహీనతా కూడా."

ఉష యేం మాట్లాడలేదు...

ఆమె మనస్సంతా అల్లకల్లోలంగా, చిందరవందరగా, అస్థిమితంగా ఉంది.

"ఇలాంటి విషయాల్లో చప్పున ఒక నిర్ణయానికి రావడం కష్టంలెండి" అన్నాడు మాధవ్ సానుభూతిగా.

"పైగా హృదయంనిండా చెదిరిపోని ఒక కృతజ్ఞత ఉంటుంది కదాండీ! అసలు నేను ఇవాళ ఒక మనిషిగా ఇలా తయారయ్యానంటే ప్రభాకరమే కదాండీ కారణం ?" అంది ఉషకళ్లల్లో నీళ్లునిలిచి కంఠం డగ్గుత్తికపడుతూఉంటే...

"నిజమే మరి ... అయితే, మెట్రిక్యులేషన్ మొదలు ఇప్పటివరకూ అయిన మొత్తం ఖర్చుఅంతా అతనేపెట్టాడా ?"

"లేదనుకోండి. పి. యు. సీ, మెడిసన్‌లో మొదటి రెండుమూడేళ్ళూ, అతను పంపించినడబ్బుతోనే చదువుకున్నాను. మెట్రిక్ మొదట్లో మా అన్నయ్య ఇచ్చాడు. తర్వాత పోవర్టీస్కాలర్‌షిప్పు వచ్చింది. మెడిసిన్‌లో ఫోర్త్ ఇయర్‌నుంచీ ఫేమిలీ ప్లానింగ్ స్కాలర్‌షిప్పు వచ్చింది."

"అయితే అతను మీ గురించి ఖర్చుపెట్టింది మొత్తం ఏడెనిమిదివేలుండదూ ?"

"ఉండొచ్చు పదివేలుదాకా ... పదివేలుకాదు పాతికవేలిచ్చినా అతనిఋణం ఎలాగండి తీర్చుకోవడం ?"

"అది నిజమే అనుకోండి...... అదిసరే — ఒకవేళ మీరీ ఫైనలియర్ అయిపోయాక ఫేమిలీప్లానింగ్ డిపార్ట్‌మెంటులో వర్క్ చెయ్యరనుకోండి. గవర్నమెంటు ఒప్పుకుంటుందా ?"

"ఎందుకు ఒప్పుకుంటుంది ? అయిదేళ్ళు పనేనా చెయ్యాలి. లేకపోతే ఏడాదికి నాలుగు వేలు చొప్పున అయిదేళ్ళకీ మొత్తం ఇరవై వేలయినా పెనాల్టీ కట్టాలి..."

"అయితే మీ రిప్పుడుముప్పై వేల అప్పులో మునిగి ఉన్నారన్నమాట!" అన్నాడు మాధవ్ నవ్వుతూ.

"ఆ... అన్నమాటే!" అంటూ ఉష కూడా నీరసంగా నవ్వింది —

మాధవ్‌లేస్తూ "ఈ సమస్యగురించిమీరు ఏం వేదనపడకండి అదే పరిష్కారం అవుతుంది"అన్నాడు.

ఉష కూడా తేలిగ్గా నవ్వి "ఆ... వేదన ఏం ఉందిలెండి... నేనూ ఈ మధ్యన ఈ విషయాల్ని మనస్సుకి అంతగా పట్టించుకోవడం లేదు... మీరు ఎంతో శ్రద్ధగా కూచుని, సంగతి ఏవిటి ? కాదూ కూడదు. చెప్పాలి. అని పట్టుబట్టడంవల్ల ఇదంతా చెప్పవలసి వచ్చింది... నా గొడవలతో పాపం మీ మనస్సుకి కూడా చీకాకు కలిగించానేమో - లేనిపోనిది" అంది.

"అదేవిటి ?... ఆత్మీయులం అనుకున్నాక ఒకరి ఇబ్బందుల్ని మరొకరు తెలుసుకోకుండా ఎలాగ ?... మరి... సాయంత్రం ప్రోగ్రాం ఏం చేశారు ? బీచ్‌కి వస్తారా ?"

"రాధ వస్తోందా ?"

"ఏమో!... ఆ మహాతల్లి ప్రోగ్రాం చివరి నిముషందాకా తేలదు... గాధ రాకపోతే మీరు రారేవిటి ?"

ఉష చిరునవ్వు నవ్వి "వస్తానులెండి" అంది.

మాధవ్ కారు వీధి మొగ తిరుగుతూన్నప్పుడు, అతను వ్యూఫైండర్ పక్కనుంచి వెనక్కి తల తిప్పి చూసి నవ్వుతూ చెయ్యి ఊపాడు.

అప్పటిదాకా మెట్లదగ్గరే నుంచున్న ఉష సమాధానంగా తనూ చెయ్యి ఊపింది.

తర్వాత బరువుగా శ్వాసవదిలి "మాధవ్ ఎంత మంచివాడు!" అనుకొని లోపలికి వెళ్లిందిఉష...

కారు హుషారుగా డ్రైవ్ చేసుకుంటూ వెళ్తూన్న మాధవ్ "ఇలాంటి అపురూపమైన యువతి కోసం ముప్పై వేలేమిటి ? అవసరం అయితే జీవితాన్నే ఇచ్చెయ్యొచ్చు" అనుకొన్నాడు.

[ఇంకా వుంది]

## ఇంటర్వ్యూ

యీ యువకుడు ఆడపిల్లల్ని ఎలా ఏడిపిస్తాడు ? అదీ చేయడు. ప్రభుత్వోద్యోగం చేయాలని ఆశపడుతున్నాడు. పరిస్థితులకు అనుగుణంగా మారటానికి ఆహారపుటలవాట్లు మార్చుకోడానికివాలాసుముఖత వ్యక్తంచేసిన ఇతని వయస్సు యిరవై సంవత్సరాలు. బి.కాం. అయ్యాకా సి. ఏ. చేస్తున్నాడు.

[వి]

## నిరంతరం

ఆకాశం నీలంగా
సామాన్యుడి జీవితం —
మినుకు మినుకుమనే నక్షత్రాలు
తీరీ తీరని అవసరాలు
దట్టంగా ఆవరించినాయి
మబ్బుల సమస్యలు
ఎదిగిన కూతురి పెళ్లి సమస్య
వీచింది రివ్వున ఫెనుగాలిగా
వాన చినుకులు చినుకులుగా
బొటబొట కారే కన్నీటిలా
మళ్లీ ఆకాశం నీలంగా
నక్షత్రాలు మినుకు మినుకు
మంటూనే ఉన్నాయి!!!

— రామసూరి

# కేవలం పదిరోజుల్లోనే మీరొక చిన్న తరహా పరిశ్రమని స్థాపించవచ్చు



# సినిమా

## మొన్న దాసం; నిన్న రాజశ్రీ; నేడు మహారథి

సంచలనాత్మక చిత్రాలను అందించిన ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌కు కె. రాఘవ అధినేత.

తొలుదొల్త నిర్మించిన "తాత – మనవడు; సంసారం – సాగరం" చిత్రాలను నేటి అగ్రశ్రేణి దర్శకుడగు దాసరి రూపొందించారు.

తృతీయ చిత్రానికి రచయిత రాజశ్రీ దర్శకుడయ్యారు చిత్రం పేరు "చదువు–సంస్కారం."

ఈమధ్య హైదరాబాద్‌లో ఒక అమాత్యుని యింట, రాఘవగారిని కలిశాను. "తర్వాతి చిత్రం ఎప్పుడు ప్రారంభిస్తున్నారు. కథ లభించిందా" అని ప్రశ్నించాను.

సాంఘిక కథలెన్నో విన్నట్టు, చివరకి పౌరాణిక కథను ఎన్నుకొన్నట్టు చెప్పారు.

చిత్రం పేరు అడిగాను "వశిష్ట – విశ్వామిత్ర" అని చెప్పారు

ఈతూరి ఎవరికి దర్శకత్వం అప్పగించారు అని ప్రశ్నించాను "వశిష్ట – విశ్వామిత్ర" కథకుడు, మాటలకర్త అయిన త్రిపురనేని మహారథికి అన్నారాయన.

వశిష్టునిగా గుమ్మడి, విశ్వామిత్రునిగా సత్యనారాయణ నటిస్తారు తదితర పాత్రలను అగ్ర నటీనటులు పోషించగలరని (అతిథి నటులుగా) రాఘవ చెప్పారు

ఆత్మ ధైర్యం వున్న రాఘవకు అదే శ్రీరామ రక్షగా వుంటూ, అతడి పథకాలకు ప్రజామోదాన్ని ఆర్జించిపెడుతూ వుంది.

శక్తిని, శ్రమను నమ్మే రాఘవకు దైవానుగ్రహం, ప్రజా బలం "తోడు–నీడగా" వుంటాయి

## క్షేత్రయ్య అద్భుతం

అంజలీ పిక్చర్ కంబైన్స్ నిర్మిస్తున్న "మహాకవి క్షేత్రయ్య" వర్ణ చిత్రం రెండు షెడ్యూల్స్ జరిగింది కదా!

జరిగినంత వరకు, రషస్ చూశారు కొందరు. అందరి అభిప్రాయం ఒక్కటే. అదేమిటన,

"క్షేత్రయ్య అద్భుతం."

కొత్త హీరో ఎలా వున్నారని ప్రశ్నించాను. "పిటపిట లాడుతూ వున్నారు. బలే హుషారుగా నటించారు శృంగార దృశ్యాలలో తన ప్రత్యేకతను ప్రదర్శించారు" అని రషస్ చూచిన విమర్శకులు వెల్లడించారు.

సంగీతం ఎలా వుంది అని అడిగాను.

"రాళ్ళు కరిగే విధంగా సంగీతం వుంది. చిత్రీకరించబడిన మూడు పాటలు, అవే సాటిగా వున్నాయి. ఆదినారాయణరావుగారి ప్రతిభ ప్రతి పాటలో కనిపించింది", అన్నారు.

జయసుధ ఖవాలీ బలే ఖుషీగా వున్నదని, ప్రభ నటన కచ్చితంగా వుందని చెప్పారు.

"క్షేత్రయ్య" చిత్రాన్ని ఆదుర్తి సిల్వర్ జూబ్లీ చిత్రంగా రూపొందించగలరన్న అభిప్రాయాన్ని, రష్ చూసిన వ్యక్తులు వెలిబుచ్చారు. "తారకరామకు పెద్ద హిట్" అన్నమాట.

## పువ్వుతో కృష్ణ సరసం

పువ్వులంటే కృష్ణకు చాలా ఇష్టంకాబోలు. ఒకరోజు కృష్ణ వికసించిన పూతోటకు వచ్చాడు. నిర్మలంగా నవ్వే ఆ పువ్వులను చూచి వర్ణించడం మొదలెట్టాడు.

"నవ్వులు రువ్వే పువ్వమ్మా
నీ నవ్వులు నాకు యివ్వమ్మా" అంటూ పరవశించిపోయాడు.

అతగాడి తన్మయత్వాన్ని చూచి జరీనా నవ్వుకుంది. ఆతడి అందాన్ని తదేక చూడసాగింది.

ఆమెను అంతవరకు చూడని కృష్ణ, తోటలో చూచి దొరక్కుండా పారిపోయాడు. అతడు వెళ్లిన బాటను అదేపనిగా చూడసాగింది, జరీనా.

చాల్లే.. పోదాం, రా అంది స్నేహితురాలు సుశీల. "కట్" అన్నారు దర్శకుడు ఆదుర్తి.

ఈ గమ్మత్తయిన ఘట్టం రవి కళామందిర్ వారి "గాజుల కిష్టయ్య" వర్ణ చిత్రంలో కనిపిస్తుంది.

ఆదుర్తి, మహదేవన్, ఆత్రేయ కాంబినేషన్‌లో నవరసభరితంగా తయారైన "గాజుల కిష్టయ్య" చిత్రాన్ని ప్రసాద్, భాస్కరరావు నిర్మించారు. శ్రీ ఫిలింస్ విడుదల.


"మహాకవి క్షేత్రయ్య"లో అక్కినేని, ప్రభ

"వైకుంఠపాళి"లో ఒక దృశ్యం







"బ్రతుకే ఒక పండుగ"లో
చంద్రమోహన్, సత్యప్రియ

## శోభన్ స్విచ్ ఆన్ కృష్ణ క్లాప్

విఖ్యాత విదూషక నటి రమాప్రభ సమర్పించు కరుణ చిత్ర వారి "వింత యిల్లు — సంతగోల" చిత్రం షూటింగు ఆగస్టు యిరవైతొమ్మిది వుదయాన ప్రారంభమైంది.

"హీ—మాన్" శోభన్‌బాబు స్విచ్ ఆన్ చెయ్య, హీరో కృష్ణ క్లాప్ కొట్ట, మొదటి షాటు హాస్య రాజా (రాజబాబు) మీద చిత్రీకరించ బడింది. ఈ చిత్రానికి పి. లక్ష్మీదీపక్ దర్శకుడు.

"వింత యిల్లు — సంతగోల" చిత్రం తాలూకు నాలుగు పాటలను సంగీత దర్శకుడు శంకర్ వినిపించారు. "చీకట్లో గుసగుసలు; అల్లరి పిల్లోడా" పాటలు శంకర్ సామర్థ్యాన్ని రుజావు చేశాయి. మిగతా రెండు పాటలు కూడా బాగానే వున్నాయి.

హైద్రాబాద్ నివాసి కమలాకరరావు నిర్మిస్తున్న "వింత యిల్లు — సంతగోల" చిత్రంలో శరత్, ప్రభ, రాజబాబు, రమాప్రభ, సత్యనారాయణ, శుభ, నాగభూషణం, రాధాకుమారి, కాంతారావు ముఖ్య తారాగణం.

సాంకేతిక శాఖలను దేవరాజ్ (ఛాయ), అప్పలాచార్య (సంభాషణం), తోట (కళ), వెంకన్నబాబు, యోగి (ప్రొడక్షన్) నిర్వహిస్తున్నారు. దర్శకుడు లక్ష్మీదీపక్‌గారికి సహాయపడే వ్యక్తులు : గాదిరాజు కేశవరావు, కృష్ణచైతన్య. భాగ్యనగర నివాసి దయానంద్ సహనిర్మాత.

ఆగస్టు యిరవైతొమ్మిది నుంచి వరుసగా నెలరోజులు షూటింగు జరిపి, అక్టోబరు యిరవై నాటికి తన చిత్రాన్ని విడుదల చేయాలన్న వుద్దేశ్యానికి పంపిణీదారులగు తారకరామ, శ్రీతారకరామ, నవభారత్ మద్దతు నిచ్చారని, నిర్మాత కమలాకర్ చెప్పారు.

## పుట్టినరోజున నలుగురికి సన్మానం

అక్టోబరు యిరవైన 'నవ్వులరాజు' పుట్టిన రోజు. తన పుట్టినరోజును అందరి రోజుగా చేయడం రాజబాబుకు అలవాటు. అర్హత వున్న వ్యక్తులను సన్మానించడం తన పుట్టినరోజు కార్యక్రమంగా పెట్టుకున్న పెద్ద మనసు వున్న మనిషి రాజబాబు.

రాబోయే తన జన్మదినంనాడు, నలుగురిని సన్మానించడానికి నిర్ణయించినట్టు రాజబాబు చెప్పాడు. ఆ నలుగురు ఎవరన : ఇంటూరి, కడారు నాగభూషణం, సి. హెచ్. నారాయణరావు, ఎస్. భావనారాయణ.





"దేవుడే దిగివస్తే"లో ఒక దృశ్యం

## చంద్రమోహన్ హత్యచేశాడా ?

చంద్రమోహన్ ఒక కళాశాల విద్యార్థి. మంచిని పెంచి, చెడును త్రుంచివేయాలనే సూత్రాన్ని బాల్యంనుంచి అలవాటు చేసుకున్నాడు చంద్రమోహన్. అందరూ మోహన్‌లా బుద్ధిగా వుంటారా ! గడుగ్గాయి పనులు చేస్తుంటారు కొందరు విద్యార్థులు. కాలేజిలో చదువుకోవడమే ఒక ఫ్యాషన్‌గా భావిస్తారు కొందరు స్టూడెంట్స్. అమ్మాయిల వెంటబడి అల్లరి చేయడం ఏదో ఘన కార్యం సాధించిన వ్యాళ్ళకుమల్లె మిడిసిపడతారు యింకొందరు. కానీ మోహన్ వీటన్నింటికీ విరుద్ధమైనవాడు.

అనవసరంగా, అన్యాయంగా ఎవరైనా తోక ఆడిస్తే, వాళ్ళొక చెయ్యి చూడందే విడిచిపెట్టడు చంద్రమోహన్. ఓసారి లలిత అనే లేతవయసుల చిన్నదాన్ని, రాంబాబు అనే హిప్పీ బలాత్కారం చేయబోగా, మోహన్ చేతిలో చావుదెబ్బలు తింటాడు రాంబాబు. చంద్రమోహన్ నిజాయితీ, నీతి తమ అవినీతి చర్యలకు అడ్డు వస్తుందని తలచిన కొందరు రాజకీయవేత్తలు అతన్ని అంతం చేయ నిశ్చయించి, పై అవకాశాన్ని వుపయోగించుకుని, అతనే రాంబాబును హత్యచేశాడనే అభూత కల్పనను సృష్టిస్తారు.

చంద్రమోహన్ నిజంగానే పై హత్య చేశాడా? ముద్దాయి ఎవరనే విషయం బయటపడిందా ? ఎలా బుజువైంది ? మోహన్ తలిదండ్రులు లెవరు ? లలితకు, మోహన్‌కు గల సంబంధం ఎలాంటిది ? ఈ నిగూఢ రహస్యాలకు సమాధానమే కిరణ్ ప్రొడక్షన్స్ వారి వర్ణ చిత్రం "బ్రతుకే ఒక పండుగ."

పి. వి. రమణయ్య సమర్పించే యీ చిత్రానికి వై. కిష్టఫర్, పి. హనుమంతరావులు నిర్మాతలైతే, పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్

ఈ ఏడు ఆరంభంలో ఆంధ్ర ప్రేక్షకులకు మంచి చిత్రాన్ని (దేవుడు చేసిన పెళ్ళి) అందించిన అట్లూరి పూర్ణచంద్రరావుగారికి శోభన్‌బాబు నవంబరు నుంచి కాల్‌షీట్లు యివ్వడం జరిగింది.

శోభన్‌బాబు యింతవరకు వెయ్యని గమ్మత్తయిన వేషాన్ని, దర్శకుడు తాతినేని రామారావు సృష్టించారు. "మొదటి సగంలో వినోదభరితమైన పాత్ర, రెండవ సగంలో విచిత్రమైన మలుపులతో తిరిగే పాత్ర"ను శోభన్ పోషిస్తున్నారు.

'హీ—మాన్'కు ప్రేయసిగా జయసుధ, చెల్లెలుగా జయప్రద నటిస్తున్నారు. సహాయ పాత్రలను సత్యనారాయణ, రాజబాబు, మురళీమోహన్ పోషిస్తున్నారు.

ఈ చిత్రానికి సత్యానంద్ మాటలను, కన్నప్ప ఛాయను, బాలు కూర్పును, జి. వి. సుబ్బారావు కళను నిర్వహిస్తున్నారు.

సినిమా

# సినిమా



''ఎదురులేని మనిషి''లో రామారావు, వాణిశ్రీ

### సత్యనారాయణ పందెం !

''బంట్రోతు భార్య'' చిత్రాన్ని నిర్మించిన అల్లు అరవింద, దాసరి సత్యనారాయణమూర్తి గార్లు ''దేవుడే దిగివస్తే'' అనెడి ఆస్తిక, నాస్తిక వాదానికి సంబంధించిన చిత్రాన్ని రూపొందించారు.

''డబ్బుంటె ఏదైనా చెయ్యొచ్చు అని సత్యనారాయణ పందెం కడితె, సరే నువ్వడిగిన డబ్బు యిస్తాను, దాంతో నువ్వేమి చెయ్యలేవు అని రామకృష్ణ సవాల్ చేస్తాడు.

సత్యనారాయణది మానవుడి వేషం. రామకృష్ణది కృష్ణుడి వేషం. మానవుడికి, దేవుడికి నడుమ జరిగిన సంఘర్షణ సారమే ''దేవుడే దిగివస్తే'' చిత్రం.

చిత్రంలో నటీనటులందరినీ సత్యనారాయణ తన నటనతో ఓడించగలిగాడేగాని, పందెంలో కృష్ణుడితో ఓడిపోయాడు.

పేదవాడి నుంచి ధనవంతుడి వరకు, ఒక్కొక్క స్థితిలోని మానసిక ఆవేశ ఆవేదనాందోళనలను సత్యనారాయణ అద్వితీయంగా చూపెట్టాడు.

కృష్ణుడుగా రామకృష్ణ ఆ పాత్ర కోరిన చిలిపితనాన్ని, కొంటెతనాన్ని చక్కగా ప్రదర్శించాడు.

సహాయ పాత్రలను పోషించిన దేవిక, అల్లు రామలింగయ్య, జయప్రద చంద్రమోహన్ కరెక్టుగా నటించారు.

''దేవుడే దిగివస్తే'' చిత్రం దాసరికి మరో విజయాన్ని తెచ్చిపెడుతుంది. ఆయన రాసిన సంభాషణలు ప్రేక్షకులను ఆకట్టుకుంటాయి.

గీతా ఆర్ట్సుకు మొదటి చిత్రం ఆర్జించిన విత్తాన్ని రెండవ చిత్రం అధిగమించగలదు. నవయుగ సంస్థ ద్వారా విడుదలయ్యే మరొక హిట్ చిత్రం యిదే కావచ్చు.

### తాతినేని ప్రకాశరావు చిత్రంలో శోభన్

అనిల్ ప్రొడక్షన్స్ నిర్మించబోయే వర్ణ చిత్రంలో శోభన్‌బాబు హీరోగా నటిస్తున్న వార్తను, 'హీ-మాన్' చెప్పారు.

''మైనరు బాబు''గా శోభన్ నటించిన విషయం పాఠకులకు తెలియనిదికాదు. ప్రకాశరావు గారి ''సంసారం'' చిత్రం మూడు కేంద్రాలలో శతదినోత్సవం చేసుకున్న విషయం పాఠకులకు తెలుసు.

శోభన్‌బాబు హీరోగా నటించే చిత్రంయొక్క షూటింగు డిశంబరు నుంచి ప్రారంభం అవుతుంది ఈ చిత్రానికి కథ, సినిమా అనుకరణ, దర్శకత్వంను తాతినేని ప్రకాశరావుగారు నిర్వహిస్తారు మాటలను భమిడిపాటికి, ఛాయాగ్రహణాన్ని వెంకటరత్నంకు అప్పగించారు.

తెలుగుదేశం గర్వించదగ్గ వుత్తమ నటి హీరోయిన్‌గా నటించగలదని తెలుస్తూంది.

శోభన్‌బాబు నటించే చిత్రాన్ని తారకరామ విడుదల చెయ్యడం యిదే ప్రథమం.

### విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ !

''ఖైదీ బాబాయ్'' ఫేమ్ టి. కృష్ణ దర్శకత్వంలో విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న వర్ణ చిత్రం షూటింగు అక్టోబరు నుంచి ఆరంభం అవుతుంది. ఈ చిత్రానికి టి. త్రివిక్రమరావు నిర్మాత.

అందాల నటుడు శోభన్‌బాబు కొత్తతరహ పాత్రను పోషిస్తున్న యీ చిత్రానికి సత్యానంద్ జి. కె. రాము, మహదేవన్, కుదరవల్లి ముఖ్య సాంకేతిక సారధులు.

### మంజుల - జయసుధ

ప్రధాన జంటగా శోభన్ సరసన నటిస్తున్నారు. సహాయ పాత్రలను అంజలీదేవి, రాజబాబు పోషిస్తున్నారు.

''మానవుడు — దానవుడు, ఖయిదీబాబాయ్, తాసిల్దారుగారి అమ్మాయి'' చిత్రాలలో శోభన్ ఎంత పేరు నార్జించగలిగారో, అంతే అవకాశం విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి కథానాయకుడికి వున్నది.

— శ్రీనివాస్



''ఫాసిజంపై విజయం'' 30వ వార్షికోత్సవం సందర్భంగా విజయవాడలో 'మేనక' థియేటర్‌లో సెప్టెంబర్ 5 నుంచి ఆరు రోజులు ఆరు సోవియట్ యుద్ధ చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. వాటిల్లో మొదటి చిత్రమైన ''అట్ డాన్ యిట్ యీజ్ క్వయిట్ హియర్'' అనే చిత్రంలోని దృశ్యం యిది.

దీపాలు వెలిగాయి. వెలిగిన దీపాలతో క్రొత్త అందాన్ని సంతరించుకుంది ఓవర్ బ్రిడ్జి. బ్రిడ్జికి ఎడమ వైపుగా నున్న బట్టలషాపులో జనంక్రిక్కిరిసి వున్నారు. కుడి వైపుగానున్న నైట్ హోటల్‌లోని రికార్డుప్లేయర్ లోనించి ఎల్లారీశ్వరి గొంతు ఎంతో దూరానికి విని పిస్తోంది.

విరామం లేకుండా రణగొణ ధ్వనులు చేసు కుంటూ హడావిడిగా తిరుగుతున్నాయి వాహనాలు. యువకులూ, యువతులూ, స్నేహితులూ, సన్ని హితులూ, ప్రేమికులూ కబుర్లు చెప్పుకుంటూ పేవ్‌మెంటుమీద నెమ్మదిగా నడుస్తున్నారు. ఎదు రుగా వస్తున్నవారిని తప్పుకుంటూ తలవంచుకొని నడచి వెడుతోంది సీత. హోటలుముందుకురాగానే సీతను ఎవరో పిల్చారు.

"సీతా"

'ఎవరు తనని పిలిచింది ?' అనుకుంటూ వెనక్కి తిరిగి చూసింది సీత. తనవెనుకగా పదిగజాల దూరంనించి నడచివస్తున్న అతను కనిపించాడు.




పలకరింపుగా పెదవులమీద చిరునవ్వు. కాంతి నిండిన కనులు. సైడ్‌లాక్స్. పైకిదువ్విన క్రాపు. సగంవరకు మడచిన గ్రేకలరు ఫుల్‌షర్టు. లేతనీలి రంగుపాంటు. చేతిలో సూట్‌కేసు. హుందాగా వున్నాడు.

రెండునిముషాలు అతన్ని పరీక్షగా చూసిన తర్వాత గుర్తుపట్టగలిగింది సీత. ఆమె ముఖంలో సంతోషరేఖలు కదిలాయి. పెదవులు విచ్చుకున్నాయి.

"జోసఫ్" అన్నది సీత.

"థాంక్స్...గుర్తుపట్టావు. నువ్వెవరో నాకు తెలీదు అంటావేమో అనుకున్నాను" నవ్వుతూ అన్నా డతను. నవ్వినపుడు అతని పెదవులు సాగి ఎంతో అందంగా వున్నాయి.

సీతకూడా చిన్నగా నవ్వింది.

ఇద్దరూ ముందుకు కదిలారు.

"ఎప్పుడువచ్చావు ఈవూరు ?" అడిగింది సీత.

"ఇప్పుడే స్టేషనునించి వస్తున్నాను. అనుకో కుండా నువ్వు కనిపించావు. మొదట్లో నిన్నుగుర్తు పట్టలేదు. తర్వాత నీ నడకచూసి నిన్ను పోల్చు కున్నాను. నువ్వు ఈ వూళ్ళో వుంటున్నావని మన క్లాసుమేటు ప్రదీప్ చెప్పాడు. కాని నువ్వు ఎక్కడ వుంటున్నావో తెలీదు. ఎలాగైనా మీఇల్లు తెలుసు కుని నిన్ను కలుసుకోవాలనుకున్నాను."

"థాంక్స్. ఇంకా నన్ను మరచిపోనందుకు"

ఒకసారి సీతముఖంలోకి అదోలా చూశాడు జోసఫ్.

ఇద్దరూ బ్రిడ్జి దిగారు.

సెంటర్లో బాగా రద్దీగా వుంది. మనుషులు అక్కడా అక్కడా నిల్చుని కబుర్లు చెప్పుకుంటు న్నారు. ఆరోజు ఏవైనా పరీక్ష ఫలితాలు తెలుస్తా యనేమో విద్యార్థులు కిళ్లీకొట్లదగ్గిర పేపరుకోసం ఎదురుచూస్తూ గుమికూడి నిల్చున్నారు. ఇద్దరూ హోటల్ ఉదయశంకర్ దగ్గరకు వచ్చారు.

అక్కడికి రాగానే "నువ్వెక్కడ వుంటున్నావో అడ్రస్ చెప్పు సీతా. రేపు మార్నింగ్ నిన్ను కలుసు కుంటాను" అన్నాడు జోసఫ్.

"అదేమిటి జోసఫ్...ఇప్పు డెక్కడికి వెడ తావు ?" అడిగింది సీత.

"హోటల్లో మీల్స్‌చేసి తర్వాత ఒక వ్యక్తిని కలుసుకోవాలి చాలాముఖ్యం ఆఫీసుపనిమీదవచ్చాను" చెప్పాడు జోసఫ్.

"నువ్వు హోటల్లో మీల్స్ చెయ్యటానికి వీల్లేదు. ఈ రాత్రికి నాచేతివంట తినితీరాలి." తప్ప దన్నట్లుగా అన్నది సీత.

సీతమాటలు వినగానే జోసఫ్‌కు అమితమైన ఆశ్చర్యం కలిగింది. సీతేనా ఈ మాటలంటున్నది ?! సీతమాటలు జోసఫ్‌కు క్రొత్తగా తోచాయి.

"రేపు మార్నింగ్ తప్పకుండా మీ యింటికి వస్తాను సీతా. ఈరాత్రికి ఆ వ్యక్తిని కలుసుకోవాలి. ఈ ఒక్కరాత్రికీ...ప్లీజ్..."

"వీల్లేదు జోసఫ్...ఏమైనా ఇప్పుడు నువ్వు నావెంట రావాల్సిందే"

కాదనలేకపోయాడు జోసఫ్. "ప రే ప ద" అన్నాడు ముందుకు కదులుతూ...

అరండల్‌పేటవైపు తిరిగారు.

జోసఫ్‌ను ఆనుకుని నడుస్తోంది సీత. ఆమె బుజాలు అతనికి రాసుకుంటున్నాయి.

సీత యాంత్రికంగా నడుస్తోంది. మనసు జోసఫ్‌లో వచ్చిన మార్పుగురించి ఆలోచిస్తోంది. 'జోసఫ్‌లో ఎంతమార్పు వచ్చింది! ఇదివరకు చామన చాయలో వుండేవాడు. ఇప్పుడు ఎరుపుకు తిరిగాడు. కొంచెం సన్నగా, బలహీనంగా కనిపించే జోసఫ్ ఇప్పుడు బలిష్టంగా తయారయ్యాడు. మనిషిలో ఆకర్షణ కూడా పెరిగింది.'

జోసఫ్ కూడా సీత పక్కగా నడుస్తున్నాడు కాని అతనూ సీతలో వచ్చిన మార్పుగురించే ఆలోచిస్తున్నాడు. 'తనతో కలసి చదువుకున్న రోజుల్లో సీతకీ ఇప్పటి సీతకీ ఎంత భేదం? సీత ఎంతగా మారిపోయింది! ఆ రోజుల్లో సీత పెదవులమీద ఎప్పుడూ చెరగని చిరునవ్వు నాట్యం చేస్తుండేది. ఇప్పుడూ నవ్వుతున్నదే కాని ఆ నవ్వులో జీవంలేదు. నక్షత్రాల్లా మెరిసే ఆ కళ్లలో తేజం ఇప్పుడు ఏమయింది? పాలు కారుతున్నట్లుండే చెక్కిళ్లు అలా పాలిపోయాయేం? ఆ కనులక్రిందనల్లని చారలు జీవితంలో ఎంతోదూరం ప్రయాణించి అలసిపోయినట్టుగా వున్నాయి. రెండుజడలు వేసుకొని చలాకీగా, సరదాగా తిరుగుతూ నవ్వుతూ, నవ్విస్తూ అందరి హృదయాలను ఆకట్టుకున్న సీతనేనా ఇప్పుడు తను చూస్తున్నది? ఆ సీత పక్కనేనా తను ఇప్పుడు నడుస్తున్నది?'

"నీలో చాలా మార్పువచ్చింది జోసఫ్" అతని ముఖంలోకి చూస్తూ అన్నది సీత.

"నీలో మాత్రం రాలేదూ ... చిక్కి సగమయ్యావు"

"నిజంగా జోసఫ్..." ఆశ్చర్యంగా అడిగింది సీత.

"అవును. నీకు తెలియటంలేదేమో! బాగా నల్లబడ్డావు కూడా"

"నువ్వు ఎర్రబడ్డావుగా...అందుకే నేను నల్లబడ్డాను" నవ్వింది సీత.

అతనూ ఆమె నవ్వులో శ్రుతికలిపాడు.

ఇద్దరూ ఓసందు మలుపు తిరిగారు. ఆ మలుపులో పెద్దమేడ. మేడప్రక్కనే చిన్నపెంకుటిల్లు. ఆ ఇంటిముందాగింది సీత.

"ఇదే మా ఇల్లు" గేటునెట్టుకొని లోపలకు అడుగుపెట్టింది. అతనూ ఆమెను అనుసరించాడు.

తాళం తీసింది సీత.

ఇద్దరూ లోపలకు నడిచారు.

చీకట్లో తడుముతూ గోడనువున్న స్విచ్ నొక్కింది సీత. లైటు వెలిగింది. కాంతితో గదంతా నిండిపోయింది.

రెండు చిన్న చిన్న గదులు. ముందు గదిలో రెండు గ్రాడ్రెజ్ కుర్చీలు. ఒకమూలగా కుట్టుమిషను. మరోప్రక్క రెండు ట్రంకుపెట్టెలు. గోడకు ఒకటి, రెండు పాతఫోటోలు ... ఎప్పటివో రంగువెలిసిన క్యాలెండర్లు దుమ్ముకొట్టుకొని గోడను వ్రేల్లాడుతున్నాయి.

"మీ అమ్మగారు లేరా?" ఇంటిని పరిశీలనగా చూస్తూ అడిగాడు జోసఫ్.

# సీత

"అన్నట్లు నీకు తెలీదు కదూ. అమ్మపోయి రెండేళ్లు కావస్తోంది" ఆ మాటలు చెబుతున్నప్పుడు సీత ముఖంలో విచారం వ్యక్తమయింది. తల్లిగుర్తుకు రాగానే సీతకళ్లు అశ్రుపూరితాలైనాయి.

"అయ్యో. అలాగా...నాకుతెలీదు" జోసఫ్ గొంతులో బాధ ధ్వనించింది.

తర్వాత ఇద్దరిమధ్య కొన్నినిముషాలపాటు నిశ్శబ్దం తాండవించింది.

"అయితే నువ్వు..." అతను పూర్తిగా అడగక ముందే అన్నది సీత "ఇప్పుడు ఒంటరిదాన్ని"

సీతను చూస్తుంటే అతనికి జాలికలిగింది. సీత ఒంటరిగా వుంటోంది? అన్నయ్యలిద్దరూ ఏమయ్యారు? సీతను ఒంటరిదాన్నెలా చేశారు? పాపం! ఒంటరిగా ఎలా బ్రతకగలుగుతుందో?

అతని ఆలోచనలను చదివినట్లు "నా ఒంటరి బ్రతుకుగురించి ఆలోచిస్తున్నావా జోసఫ్? ముందు కాళ్లుకడుక్కో ..తర్వాత ఆలోచిద్దువుగాని" నవ్వుతూ చెంబుతో నీళ్లు అందించింది సీత.

బూట్లు విప్పి కాళ్లు కడుక్కుని లోపలకు వచ్చాడు జోసఫ్. అతను లోపలకు వచ్చేసరికి టవలు పట్టుకు నిల్చుంది సీత. టవలు అందుకుంటూ ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె ముఖంలో ఏదోతృప్తి కనిపించింది. ఆమెకనులు మెరుస్తున్నాయి.

"ఈ కుర్చీలో కూర్చుని కబుర్లు చెబుతూ వుండు. అరగంటలో వంటపూర్తిచేస్తాను" వంట గదిలోకి వెడుతూ అన్నది సీత.

సీత ప్రవర్తన జోసఫ్‌కు వింతగా తోచింది. ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అసలు సీతలో ఇంత మార్పు ఎలావచ్చింది? ఎలాంటి సీత ఎలా మారిపోయింది? సీతలో ఇలాంటి మార్పువస్తుందని తనెన్నడూ వూహించలేదు. ఆ రోజుల్లో సీత తనతో బియ్యేచదివేరోజుల్లో -

ఆ రోజులు జోసఫ్‌కు గుర్తుకొసాగాయి.

తనక్లాసుమేటు రమణమూర్తిద్వారా తనకు బియ్యే సెకండియర్‌లో పరిచయమయింది సీత. రమణమూర్తి సీతకు దూరపుబంధువు. రమణమూర్తి తను ఎంతో ఆత్మీయులుగా మెలగేవాళ్లు. తరచు రమణమూర్తి ఇంటికి వచ్చే సీతతో తన పరిచయం పెరిగింది. తనకు తెలియకుండానే సీతను ప్రేమించటం మొదలుపెట్టాడు. సీతకూడా తనతో ఎంతో ఫ్రీగా మాట్లాడేది. సీత మాటల్లో తనని అభిమానిస్తున్నదనే భావం తనకు గోచరించేది. అందుకే ఒకరోజు —

ఆరోజు ఆదివారం. తను సాయంత్రం అయిదు గంటలకు రమణమూర్తి ఇంటికి వెళ్లాడు. అతను ఇంట్లోలేడు. ఎక్కడికో వెళ్లాడు. తను వెళ్లబోతుండగా సీత వచ్చింది. రమణమూర్తిలేడని తను చెప్పగానే "బోర్‌కొడుతోంది ... మూర్తి వున్నాడేమో కారమ్స్ ఆడదామని వచ్చాను" అన్నది సీత. "నేనూ అందుకే వచ్చాను. ఎలాగూ ఇద్దరికీ బోర్‌కొడుతోందికదా... పార్కుకు వెడదాం" రమ్మన్నాడు.

రెండు క్షణాలాలోచించి తనవెంట బయల్దేరింది సీత.

ఆ చల్లని సాయంత్రం —

హైదరాబాదు రోడ్లమీద పక్కపక్కనే నడుచుకుంటూ పార్కుకు వెళ్లారు. నీరెండలో పచ్చగడ్డిమీద పక్కపక్కనే కూర్చున్నారిద్దరూ. సీత చేతిని తన చేతిలోకి తీసికొన్నాడు. ఆమె చేతివ్రేళ్లను మృదువుగా రాస్తూ తనకోరికను బయటపెట్టాడు. "నన్ను పెళ్లిచేసుకోవూ ... సీతా" అనడిగాడు. అప్పుడు సీత ఏమన్నది? "చూడు జోసఫ్ ... మనిద్దరి జీవితాలు సమాంతరరేఖలవంటివి. ఎక్కడా కలుసుకోవు. మీరు క్రిస్టియనులు. నేను మీకులం కాదు. మీమతం వేరు. మామతంవేరు. మీ కులం మాకులం ఒకటికాదు. నేను వెజిటేరియన్‌ని. నువ్వు నాన్‌వెజిటేరియన్‌ని. ఇంకా ఎన్నో విషయాలలో మనిద్దరికీ పొత్తు కుదరదు. క్షమించు జోసఫ్ ... ఈ జన్మలో మనపెళ్లి జరగదు." అన్నది సీత. అంతే. ఆ తర్వాత సీతదగ్గర మళ్లీ ఎప్పుడూ పెళ్లి విషయం తీసుకురాలేదు. ఆరోజు అలా మాట్లాడిన సీత ఈరోజు తను క్రిస్టియన్ అనేభావం మరచిపోయినట్లు ఎలా ప్రవర్తించగలుగుతోంది!

జోసఫ్‌కు అంతా విడ్డూరంగావుంది.

"ఏమిటి జోసఫ్ ఆలోచిస్తున్నావు?" అడిగింది సీత. "ఏంలేదు. మనిద్దరం కలసి చదివిన రోజుల్ని గుర్తు తెచ్చుకుంటున్నాను"

"ఆరోజులే మంచివికదూ? ఎంతో సరదాగా.. సంతోషంగా ఎలాంటిదిగులూ లేకుండా గడిచేయి... అవును జోసఫ్...ఇన్నిరోజులూ ఎక్కడ వున్నావ్?" అడిగింది సీత స్టవ్ మంట తగ్గిస్తూ...

"కంపెనీవాళ్లు ట్రెయినింగ్‌కి ఇటలీపంపారు. ఈ మధ్యనే అక్కడినించి తిరిగి వచ్చాను"

"అయితే." ఏదో మాట్లాడబోయింది సీత.

సీత మాటలు పూర్తికాకముందే "బాగానే వృద్ధిలోకి వచ్చానంటావ్. అంతేనా?" అన్నాడు జోసఫ్..

"ఉహు...నా ఉద్దేశ్యం అదికాదు జోసఫ్..."

"నాకు తెలుసు సీతా ... డిగ్రీ పూర్తవగానే చదువు మానేస్తానని చెప్పాను కదూ ... సరే నా విషయం తర్వాత మాట్లాడుకుందాం ... ముందు నీ సంగతి చెప్పు. నువ్వేం చేస్తున్నావు?" అడిగాడు జోసఫ్...

"ఆ కుట్టుమిషన్ చూడు" మిషన్‌వైపు వ్రేలును చూపిస్తూ అన్నది సీత. మళ్ళీ అన్నది "అదే నా జీవనాధారం"

"అదేమిటి సీతా...డిగ్రీవుందిగా... ఎక్కడైనా ఉద్యోగం చెయ్యలేకపోయావా?"

"చాలా ఉద్యోగాలు చేశాను"

"చేశాను అంటున్నావేమిటి? నీ మాటలు నా కర్థం కావటంలేదు"

"అవును. ఇంతకు ముందు చేశాను. ఇప్పుడు మానేశాను" చెప్పింది సీత...

"ఎందుకు?"

"ఎందుకేమిటి జోసఫ్.. ఉద్యోగం చేసే ఆడదాన్ని ఈ మనుషులు ఎలా చూస్తారో నీకు తెలీదూ?... అందులోనూ తోడులేని ఆడదని

(47వ పేజీ చూడండి)

అధికోత్పత్తియే ప్రగతికి మూలం

అతని మాటలకు కాస్సేపు మౌనం వహించి.

''నేనుండీ మీకు పనికిరానిదాననయ్యాను'' అంది.

''అందుక్కాదు వర్ధనీ. అన్నట్లు నువ్వు ఉద్యోగంలో చేరావటగా. మరి యీ రోజు ఆఫీసు లేదా ?''

''వెళ్లాలి. మరి నేను వెళ్లిరానా'' అంది లేస్తూ. అప్పటికే టైం అయిందని సిస్టర్ రెండుసార్లు హెచ్చరించి వెళ్లింది.

''అన్నట్టు సాయంత్రం అన్నయ్య వస్తానని చెప్పమన్నాడు'' అంది.

''యేవిటో వర్ధనీ మీ కందరకీ శ్రమ కల్పించాను'' అన్నాడతను.

తను తెచ్చిన పళ్లు షెల్ఫ్‌లో పెట్టి బయల్దేరింది వర్ధని:

హాస్పిటల్ గేటు దాటినగల్లా ఎవరో పిలుస్తున్నట్లై వెనుదిరిగి చూసింది. కొంచెం దూరంలో పరిచయమున్న వ్యక్తి !

''రాణీ ! నువ్వా ! యేమిటి యిక్కడున్నావ్''

''ఇక్కడకెందుకొస్తాంచెప్పు? తాతయ్యకు సీరియస్‌గా వుంటే అడ్మిట్ చేశాను—యేమిటో మన ఆత్మతే మందిగాని రోగి హరీ మనేవరకూ అంతా బాగానే వుందంటారు డాక్టర్లు—''

''ఇంతకూ ఏమైందాయనకు ?''

''మామూలే పైగా పెద్ద వయసు!''

ఇద్దరూ బస్టాపు వైపు నడిచారు.

''యేమిటో వర్ధనీ. మనసంతా భయంతో నిండివుంది ! ధైర్యం చెప్పే మనిషిలేడు. ఉన్న యీ ఒక్క పెద్దదిక్కూ భగవంతుడు లేకుండా చేస్తే వంటరిగా నే నెలా బతకాలో తల్చుకుంటేనే భయమేస్తోంది.''

రాణి కళ్లలో నీరు తిరగడం గమనించింది వర్ధని.

''అలాగెందుకనుకున్నావ్. నీకుమేమంతా. లేమూ ? ' అన్నదేగాని తనిమధ్య వాళ్ళింటికి వెళ్లనందుకు ఎంతో నొచ్చుకుంది వర్ధని.

## 20

ఆ రోజంతా ఆఫీసులో అన్యమనస్కంగానే గడిపింది వర్ధని పేరుకే ఆఫీసుగాని ఆ అమ్మాయికి ఆట్టే పని వుండదు. ఎప్పుడో రేవులోకి షిప్పు వచ్చినప్పుడు పని ఎక్కువగా వుంటుంది. మగవాళ్ళకైతే ఆ రోజుల్లో రాత్రింబవళ్లు కూడ పని

—సీరియల్—

# రాగవాహిని

—ఆదూరి—

—వేంకటసీతారామమూర్తి—

*(గత సంచిక తరువాయి)*

చెయ్యాల్సి వస్తుంది. ఆ అవసరం గూడ వుండదు వర్ధనికి.

సాయంత్రం యింటికి వచ్చేసరికి అరుగు మీద కూర్చున్న వ్యక్తిని చూసి చటుక్కున గుర్తు తెచ్చుకుంది. అతను బాబూరావు !

''యేం బాబూరావ్ ! బాగున్నావా ''అంది పలకరింపుగా నవ్వి.

''బాగున్నానమ్మా'' అన్నాడతడు లేస్తూ.

''లోపలకువచ్చి కూర్చో—ఎంతసేపైంది వచ్చి ?''

'' అరగంటైందక్కా '' జవాబిచ్చాడు క్రిష్ణుడు.

''తాతయ్య, అమ్మమ్మ బాగున్నారా''

''యేంబాగో—అలాగే వున్నారమ్మా'' అతని మాటలకు ఆశ్చర్యంగా చూసింది.

*జరిగినకథ : 9* చదువుకుని ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకోవాలనే వుద్దేశ్యంతో విశాఖపట్నం వచ్చిన వర్ధనికి, రాజశేఖరం మామయ్య ప్రోత్సాహం లభిస్తుంది. వర్ధని అన్న ప్రసాద్ చిరుద్యోగి. స్నేహితుడు రజనీకాంత్‌ని వర్ధనికి పరిచయం చేస్తాడు ప్రసాద్. వర్ధని మెట్రిక్ పాసవుతుంది. వర్ధని తల్లి మాణిక్యమ్మగారు మరణిస్తారు. వర్ధనీ రజనీకాంత్‌లు వివాహం చేసుకోవాలనుకుంటారు. సుందరిచే మోసగించబడ్డ ఆనందరావుకి అతనంటే ఇష్టపడే రాణిగురించి చెప్తుంది వర్ధని. ప్రయివేట్‌గా చదివి ఇంటర్ పాసయిన వర్ధని వుద్యోగంలో చేరుతుంది. స్కూటర్ ప్రమాదంలో గాయపడ్తాడు రజనీకాంత్.

''ఇద్దరికిద్దరూ పెద్దవాళ్ళైపోయారు గదమ్మా—లేస్తే కూచోలేరు — కూచుంటే లేవలేరు. మనిషి సాయం కావల్సిన రోజులు'' చెప్పుకు పోతున్నాడు బాబూరావు.

''సాయం ఎలావస్తుందిచెప్పు బాబూరావు. కొడుకులు రమ్మనే అంటారు. నా యిల్లూ నా భూమీ అని పట్టుకు కూర్చుంటే ఎవరేం చేయగలరు చెప్పు ?''

''నిజమేనమ్మా — కానీ ఎవరిదగ్గరున్నా వాళ్లకి కష్టమే. అందుకే రాజేశ్వరమ్మగారికి వుత్తరం రాశారు రమ్మని. ఆ అమ్మగారే వున్నారిపుడు.''

''యేవిటీ పిన్ని వొచ్చిందా ? ఆమె వచ్చిందీ అంటే యేదో వుండే వుంటుంది'' నోరు జారేసినా చటుక్కున మూడో మనిషి ముందలా అన్నందుకు బాధపడింది.

''యేదో యేంటమ్మా — ఆళ్ల పెద్దమ్మాయికి పెళ్లి కుదిరిందిటగా'' అని. వర్ధని దగ్గరనుండి యే జవాబూ లేకపోయేసరికి ''మామయ్యగారికి ధాన్యం గింజలివ్వడానికి వచ్చానమ్మా. ఎటూ వచ్చానుగదా పిల్లల్ని గూడ చూసిపోదామనివచ్చాను. వస్తానమ్మా'' అంటూ లేచాడు బాబూరావు.

ఇంతవరకూ తాతయ్యే బాబూరావును పంపించాడనుకుంది. కానీ నిజం తెలిశాక వర్ధని మనసెందుకో చిన్నబోయింది. అందుకే కొన్ని కొన్ని విషయాల్లో బంధువుల కంటె పైవాళ్లే నయమనిపించేది !

'ప్రసాదుబాబుని చూడ్డమయిందేగాదు' అనుకుంటూ బయల్దేరి గుమ్మందాటి, తాతయ్యగారికేంచెప్పమంటారమ్మా' అడిగాడు.

''యేం వున్నాయి కొత్తవి...'' అని ముక్తసరిగా పూరుకుంది వర్ధని. చూస్తుండగానే బాబూరావు కనుమరుగయ్యాడు.

ప్రసాద్ యింటికి వచ్చేసరికి రాణి

ఎనిమిదిగంటలయింది. తమ్ముళ్లి విద్దర్నీ సినిమాకి పంపించి తనొక్కతే కూర్చుంది వర్ధని. హాస్పిటల్‌కి వెళ్తానని ప్రసాద్ ముందుగానే చెప్పడంవల్ల ఆతృతపడలేదుగాని ఆలస్యమౌతున్నకొద్దీ రజనీకాంత్ పరిస్థితిని తల్చుకుని భయపడసాగింది. అందుకే ప్రసాద్ గుమ్మంలోకి రాగానే,

''ఎలావుందన్నయ్యా ఆయనకి'' అనడిగింది.

''అలాగే వుందమ్మా. పూర్తిగా కోలుకోడానికి కనీసం నెలన్నా పట్టవచ్చు. కానీ అరని బలవంతంపైనే యీ రోజు డిశ్చార్జి చేశారు. ఇంటి దగ్గర దిగవిడిచే వస్తున్నాను''

''ఆయన బలవంతం చేస్తే మాత్రం అంత త్వరగా ఎలా డిశ్చార్జి చేశారన్నయ్యా'' అడిగింది ఆశ్చర్యంగా.

''యేముందమ్మా. రజనీకాంత్ ఆడాక్టర్నే పెట్టి స్వయంగా ట్రీట్‌మెంట్ పొందగలడు. వాళ్లకి మెడికల్ రీయింబర్స్‌మెంటు కూడా వుంటుంది.''

మరేం మాట్లాడలేదు వర్ధని.

ఆ తర్వాతఅన్నం వడ్డిస్తూ,

''మనూరునుంచి బాబూరావు వచ్చాడన్నయ్యా. మామయ్యగారింటికి ధాన్యం

# రాగ పి చి క లు

పట్టుకొచ్చి పిల్లల్ని చూద్దామని యిలా వచ్చాడుట. నువ్వు కన్పించలేదని బాధపడ్డాడు'' అంది.

''అదిసరే — ముసలాళ్ళేమంటున్నారుట'' కొంచెం హేళనగానే అన్నాడు ప్రసాద్.

''వాళ్ళనేందు కేముంది — మనదగ్గరికి వెళ్ళమనేం వాళ్ళు చెప్పలేదు— ఇతనికి చూడాలనిపించి వచ్చాడంతే. అయినా చిన్నకూతురు దగ్గరుంటే మనమంతా జ్ఞాపకముంటామా యేమన్నానా ?''

''ఆవిడగారెందు కొచ్చింది ? ఇంకా యేమన్నా మిగిలివున్నాయేమిటి తీసుకువెళ్ళేందుకు ?

''పెద్దమ్మాయికి పెళ్లి కుదిరిందటగా— కట్నండబ్బు కావద్దామరి ? లేకుంటే మొగుడినీ పిల్లల్నీ వదిలి యీ ముసలాళ్లకి చేసి పెట్టేందుకే వచ్చిందేమిటి ?''

''ఎవరికెంత పెడతారో పెట్టమను — అమ్మకిరాసింది న్యాయంగా మనకిస్తే అంతే చాలు.''

''నీకేం పిచ్చా అన్నయ్యా — ఆపుద్దేశమే వుంటే మామయ్యకు పంపినప్పుడు మనకీ ఓ మూటగింజలు పంపేవారు. ఇంకా దానిమీద ఆశలు పెట్టుకోడం మన తెలివితక్కువే అవుతుంది.''

ప్రసాద్ మరేంమాట్లాడలేకపోయాడు.

అతనికి తాతగారిపై కోపం ముంచుకొచ్చింది. భోజనాలయ్యాక పక్కవేస్తూ, ''అన్నట్టు చెప్పడం మరచానన్నయ్యా నిన్నవచ్చినయిద్దరూ మళ్ళీ నీగురించి వచ్చి వెళ్ళారు.'' అంది వర్ధని.



అతనేం మాట్లాడలేదు. కానీ అతని ముఖంలో మారిన రంగుల వెనుకనున్న అర్థాన్ని వర్ధని గ్రహించి, ''వాళ్ళకి మనమేమైనా యివ్వాలా అన్నయ్యా'' అంది నెమ్మదిగా.

''అవునమ్మా'' అని ముఖాన్ని అవతలికి తిప్పుకున్నాడు.

'నేనుకుంటూనేవున్నానన్నయ్యా. అభిమానానికిపోయి అప్పులపాలైంది మనమైతే పోషించిన ఘనత వాళ్ళకి! ఇంతకీ ఎంతివ్వాలన్నాయ్యా ?''

''నీకెందుకులేమ్మా అవన్నీ''

''అదికాదన్నయ్యా యిప్పటి వరకూ నా సంపాదనతో యింట్లో వస్తువులు సమకూర్చుకోడంతోనే సరిపోయింది. పైనెల నుండీ నెలకు కొంతైనా దాస్తేగాని మన కున్న అప్పులు తీరవు— సంఘంలో గౌరవమూ యేర్పడదు.''

ప్రసాద్ సమాధానం చెప్పలేదు. తిరిగి రెట్టించేందుకు యిష్టంలేక అంతటితో వూరుకుంది. వర్ధని.

*　*　*

పక్కమీద అటూయిటూ దొర్లుతున్నాడేగాని ఆనందరావుకి నిద్ర రావడంలేదు. చదువుకునే రోజుల్లో, పదిన్నరవరకూ వేచి వుండేవాడు. చదువయి ఉద్యోగంలో చేరినా ఆ అలవాటు దూరంకాలేదు. యేదైనా పుస్తకం చదివితేగాని నిద్రరాని పరిస్థితి. ఈరోజు పుస్తకం కూడ చదవబుద్ధి కాలేద తనికి. కళ్లు మూసినా తెరిచినా అతనికి దీనవదనంతో వున్న రాణే కన్పిస్తోంది.

వర్ధని ఆ యింటి నుండి వెళ్లాక కూడ రాణి రావటం మానలేదు. మొదటిసారి ఆనందరావే వర్ధని వెళ్లిన సంగతి చెప్పాడామెతో. ఆరోజే ఆమె మనసు విప్పి మాట్లాడింది. ఆనందరావు కామెపై అయిష్టతలేదు. అందుకే వర్ధని చెప్పినపుడు కూడ ఆలోచించండే చెప్పలేనన్నాడు.

రాణి మాటల్లో ఎంతో ఆత్మీయత కన్పించిందతనికి. రోజులు గడుస్తున్న కొద్దీ రాణిపై అతనికి యిష్టం యేర్పడింది. పూర్వం తను 'ప్రేమ' అనుకున్న దానికి యిప్పటి యీ తీరుని అనుబంధానికీ వ్యత్యాసాన్ని వూహించుకో గలిగాడు.

తను కోరుకున్న మనిషికి సంస్కారంతో పాటు ఆత్మీయత, అనురాగం, ఆకర్షించే మనస్తత్వం వుండాలిగాని కేవలం చదువు, అందం జీవితానికి పరిపూర్ణత నివ్వలేవన్న నగ్నసత్యాన్ని తొందరలోనే తెల్సుకున్నాడు.

తమ వివాహానికి అభ్యంతరమైన విషయం యేదన్నా వున్నదంటే అది కేవలం 'శాఖ' భేదమే. ఆ మాత్రం సర్దుకుపోవడం ప్రస్తుత పరిస్థితుల్లో ఎందరికో అలవడినా మాధవరావుగారి విషయంలో సరిపెట్టుకో లేరన్నది ఆనందరావుకీ తెల్సు. అయినా అతను ధైర్యంగానే వున్నాడు.

ఇన్నాళ్ళూ రాణికి పెద్ద దిక్కుగా వుంటున్న ఆమె తాతగారు అస్వస్థులవడం చాల రకాలయిన ఆలోచనలకు పునాది తీసింది. రోజూ వెళ్ళి చూసి వస్తూనే వున్నాడు. ఆమెకు ధైర్యం చెబుతూనే వున్నాడు. కానీ యీరోజు పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది. దానికితోడు డాక్టర్ల పెదవి విరుపు.

రేపేమైనా అయితే రాణిని చూసే దెవరు ? ఆమె కాశ్రయమిచ్చేదెవరు ? ఆమె బ్రతుకు గడిచేదెట్లా ? ఆలోచనలతో ఎప్పుడో మాగన్ను పట్టింది.

* * *

ఉదయం ఆఫీసుకు వెళ్ళేముందే రజనీ కాంత్‌ను చూసి వెళ్ళాలనుకుంది గాని యింటి పని తెమలలేదు వర్ధనికి ఆరోజు ఆఫీసులో కూడ అట్టేపనిలేదు. ఆమధ్యాహ్నం పర్మిషన్ తీసుకుని బయల్దేరింది.

ఈమాటెందుకో రజనీకాంత్‌తో బెరుకు గానే మాట్లాడింది. తప్పుచేసిన దానిలా ఫీలవుతూ వచ్చింది. అతనిలో మాత్రం యేమార్పు ఆమెకు కన్పించలేదు.

"బంధువులు లేనిలోటు నాకిప్పుడే తెలుస్తోంది వర్ధనీ. ఒక్కోప్పుడు యీ యేకాకి బ్రతుకెందుకన్పిస్తుంది. ప్రేమ, అభిమానం ఒకరినుండి పంచుకోని జీవితం నిరర్ధకం వర్ధనీ" అతని మాటలకామె కళ్ళు చెమర్చాయి. సముదాయించేందుకు కూడ నోరు రాలేదు. పళ్ళరసం తీసి తన చేతుల మీదుగా తాగిస్తూ 'మీకోసం నేను లేనూ" అంది.

ఇంకా ఆ విషయం మర్చిపోలేదూ ? అన్నట్లు నవ్వాడు. నవ్వి, 'నువ్వు కావాలి వర్ధనీ. నీ గురించి ఆ శ్రేష్ఠ రోజులు కలలుగన్న నేను. నాకా భాగ్యాన్ని త్వరలోనే ప్రసాదించు' అని ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

నవ్విన ఆమె కనుకొలకల్లో నుండి రెండు నీటిబొట్లు రాలాయి.

* * *

రోజూ ఐదుగంటలకైనా రాని ప్రసాద్ అప్పుడే రావటంచూసి 'యేం అన్నయ్యా అప్పుడే వచ్చేశావ్—' అని,అతని ముఖం వంక చూసి 'ఒంట్లో బాగాలేదా అన్నయ్యా' అంది వర్ధని.

"లేదమ్మా – అమ్మమ్మకు సీరియస్‌గా వుందని టెలిగ్రాం వచ్చింది. మామయ్య హూరెలుతూ ఫోన్‌చేసి చెప్పారు."

"నువ్వుకూడ వెళ్ళాలనుకుంటున్నావా?"

"తెల్సిండీ వెళ్ళకపోతే బావుంటుందా ? పైగా పెద్దది రేపేమైనా జరిగితే ... ?" అంటూ ఆగి వెళ్ళేందుకు పరిస్థితులు కూడ బాగాలేవు. అదే ఆలోచిస్తున్నా" అన్నాడు.

"డబ్బుకోసం ఆలోచించకన్నయ్యా – నాదగ్గరుంది తీసుకువెళ్ళు-ఎంతైనా అమ్మ తర్వాత అమ్మ లాంటిది. వెళ్ళన్నయ్యా" అంటూ బయల్దేరదీసింది.

ఆ రాత్రికే ప్రయాణమయ్యాడు ప్రసాద్.

## *21*

"వర్ధనిగారున్నారా?" గుమ్మం లోపలికి వచ్చి అడిగినది ఎవరో తెలియక కొత్తగా చూశారు క్రిష్ణుడు, వాసు.

"లేదు–మామయ్యగారింటికి వెళ్ళింది" వెంటనే జవాబు చెప్పాడు కృష్ణుడు. ఒక్క క్షణం ఆమె తటపటాయించింది.

"వచ్చేస్తుంది కూర్చోండి" అన్నాడు వాసు కుర్చీ చూపుతూ ఆమె క్షణం ఆలోచించి వచ్చి కూర్చుంది. కాస్సేపు ఎవరూ యేం మాట్లాడలేదు. క్రిష్ణుడు మళ్ళీ చదువులో పడ్డాడు. తెలియని లెక్కలు వాసునడిగి చెప్పించుకుంటున్నాడు. ఆ గది నంతటినీ పరిశీలనగా చూసిందామె.

ద్వారానికి యెదురుగా పుస్తకాల గూడు, అందులో చక్కగా అమర్చబడ్డ పుస్తకాలు, గూడుకు ఎడంచేతి వైపు గ్రామఫోను ప్లేటు మీద పెయింట్ చేసిన రవీంద్రుని బొమ్మ. కుడివైపు గోడకు అద్దం, గదికీ గదికీ మధ్య గుమ్మానికి ఎంబ్రాయిడరీ చేసిన తెల్ల తెర. సింపుల్‌గా నీటుగా వుందాగది.

పావుగంట గడిచింది. ఈ పావుగంటలోనే వీధివైపు, వాచీవైపు ఎన్నోసార్లు ఆమె చూడడం గమనించాడు వాసు

"మీ రెవరో చెబితే అక్కయ్యకు చెప్పి తీసుకొస్తా" అన్నాడు.

ఆమె క్షణం ఆలోచించి, ఇక తప్పదని:

"సుందరని చెబితేచాలు. మీ అక్కయ్యకు తెలుస్తుంది" అంది. వాసువెంట క్రిష్ణుడూ బయల్దేరాడు.

"వాళ్ళిల్లు చాలా దూరముంటుందా బాబూ" అంది సుందరి.

"లేదండీ. ఇప్పుడే వచ్చేస్తాం కూర్చోండి" అంటూ ఝుఱుమన్నారిద్దరూ.

తలుపు వారేసి, కాస్సేపు వీధి గుమ్మంలో నిల్చుని మళ్ళీ లోపలికొచ్చి అలమరలోని ఓ పుస్తకం తీసుకుని కుర్చీలో కూలబడింది సుందరి.

* * *

ఇంటికొచ్చిన వర్ధనికి పరిస్థితేం బోధపడ లేదు. సుందరి తనకోసం వచ్చిందన్న వార్త కంటె ఆశ్చర్యంగా వుంది అక్కడి పరిస్థితి. తనకోసం వచ్చిన సుందరి లేదు. వీధి తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

గదిలో సామాన్లు చిందర వందరగా పడివున్నాయి నేలపై అక్కడక్కడ పగిలిన గాజుముక్కలున్నాయి – సుందరి చదివిన పుస్తకం ఓమూల పడివుంది. వంటింటిగది గుమ్మానికి కట్టిన తెర తెగివుంది వంటిం

రా గ

### ధర్మపథం

## మాయకు

జీవాత్మ పరమాత్మయొక్క అంశమే అందువల్ల ప్రతి వ్యక్తిలోనూ పరమాత్మ ఉన్నాడనీ, ఉపాధిభేదంవల్ల జీవుడుగా కాన వస్తున్నాడనీ గ్రహించాలి. కాని, 'నేనే ఆ పరమాత్మను' అనే జ్ఞానం కలగడం దుర్ఘటం. దానిని మాయ ఆవరించి ఉన్నందున అట్టి జ్ఞానం కలగడం అసాధ్యం. మహామునులకు కూడా అది సాధ్యం కాదు. వారున్నూ మాయకు లొంగిపోతూనేఉంటారు.

మహాభక్తుడైన నారద మహామునీ, శ్రీకృష్ణుడూ ఒకనాడు కలిసి వెళ్ళుతున్నారు. అప్పుడు నారదుడు 'శ్రీకృష్ణా! నీ మాయలు వర్ణింప నలవి కానివని అంటారు అవి యెట్టివో నాకు తెలియడం లేదు' అన్నాడు. భగవానుడు 'దానికేమిలే. నీ దగ్గర నా మాయలా?' అని నవ్వుతూ అన్నాడు. వారు పోతూ, పోతూ ఒక అడవి చేరుకున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు 'నారదా! దాహంగా ఉన్నది. ఈ దగ్గర నీరు దొరుకుతుందేమో చూడు' అన్నాడు నారదుడు కొంత దూరం వెళ్ళగా ఒక కుటీరం కానవచ్చింది. 'ఇక్కడ ఎవరున్నారు?' అని అనేసరికి ఒక చక్కని అమ్మాయి లోపలినుంచి బయటికి వచ్చింది. ఆ అమ్మాయిని చూచేసరికి మహామునికి ఆమెపై మోహం కలిగింది. తాను వచ్చినపని మరచిపోయాడతడు. తర్వాత ఆపిల్ల తండ్రిని చూచి, ఆమెను తనకిచ్చి వివాహం చెయ్య మన్నాడు. ఆ అమ్మాయికూడా ఇష్టపడింది. తర్వాత వారిద్దరికీ వివాహం జరిగింది. మహా

## లొంగిన మహాముని

ముని ఆ దగ్గరే ఒక కుటీరం నిర్మించుకుని తన భార్యతో కాపురం చెయ్యసాగినాడు. ఇలా పన్నెండేళ్ళు గడిచాయి. ఆ దంపతులకు ముగ్గురు పిల్లలుకూడా కలిగారు.

ఒకప్పుడు జలప్రళయం వచ్చింది. ఆ ప్రదేశమంతా జలమయమయిపోయింది. వరదలో అతని కుటీరం కొట్టుకుపోయింది. తన భార్యా, బిడ్డలను ఒక ఉన్నత ప్రదేశానికి తీసుకువెళ్లడానికి నారదుడెంతో ప్రయత్నించాడు. లాభం లేకపోయింది. వారు ఆ వరదలో కొట్టుకుపోయారు. అతడుమాత్రం ప్రాణాలు దక్కించుకుని ఒక మిట్టప్రదేశం చేరుకుని, తనవారిని తలుచుకుని విలపింపసాగాడు.

ఇంతలో తన వీపుపై ఎవరో తట్టినట్టయింది. వెనుక తిరిగిచూస్తే శ్రీకృష్ణుడు. ఆ ప్రాంతమంతా వెనుకటి అడవిగానే ఉంది. వరదా, ఏదీ కానరాలేదు. అతడు నిర్ఘాంతపోయాడు. శ్రీకృష్ణుడు నవ్వుతూ "నారదా! నేనడిగిన మంచినీళ్లు దొరకనేలేదా?' అన్నాడు.

నారదుడు 'భగవాన్ ! నీ మాయ ఎటువంటిదో తెలిసింది. పది క్షణాల కాలంలో పన్నెండేళ్లు సృష్టించి, నన్ను ఆటలాడించావు. లేని వేదనను కలిగించావు. నీ మాయకు లొంగనివారెవ్వరు ? ఎంతో తపస్సు చేసి, పరతత్త్వగవేషణ చేసే మునులు కూడా నీ మాయను తప్పించుకోలేరు' అన్నాడు.

—బులుసు వేంకటరమణయ్య

## వీచికలు

ట్లోకి అడుగుపెట్టిన వర్ధని అలాగే వుండిపోయింది. ఎత్తైన మంచం వాల్చివుంది. మంచంకింద గాజుముక్కలు, పూరేకులు వర్ధని గుండెలు కొట్టుకున్నాయి. యేం జరిగిందో లీలగ బోధపడుతోంది.

ఎవరు ? ఎలా ? ఎందుకు ? — ఇవి మాత్రం వూహాకతీతంగా వుండిపోయాయి ఎప్పుడూ లేనిది వంటరితనానికి భయపడింది. పనిమనిషిని పంపుతానని అత్తయ్య చెప్పినప్పుడు వద్దనక పోవడం కూడ ఒకందుకు మంచిదే అనుకుంది – గదిపూడ్చి, చక్కబెట్టి నోటికేం దిగకపోయినా భోజనం అయిందనిపించేసర్కి పనిమనిషి రానేవచ్చింది. అంతా నిద్రపోయినా వర్ధనికి మాత్రం నిద్ర రాలేదు లేచి పుస్తకాలగూడు దగ్గరకు వెళ్ళినదల్లా ఆశ్చర్యంతో అక్కడ మడిచివున్న కాగితాన్ని చేతిలోకి తీసుకుంది– అది సుందరి స్వహస్తాలతో వ్రాసిన వుత్తరం.

వర్ధనిగార్కి—

ఈ దౌర్భాగ్యురాలు గుర్తుందనుకుంటాను ఎందుకంటే మంచిచేసిన వారికంటే చెడు చేసినవారే సామాన్యంగా గుర్తుంటారు – డబ్బుకోసం అందాన్నీ అహాన్నీ వుపయోగించి ఎందర్నో మోసం చేశాను. కానీ దానివల్ల నాకు కలిగిన ఆనందం బహుస్వల్పమే అయినా అడుగడుగునా ఎదురైన సమస్యలు, సంఘటనలు నామనసును కాల్చివేశాయి – ఓరోజు ఆనందరావుగార్ని యిక్కడ చూశాను – ఆతర్వాత యిది మీయిల్లని తెల్సుకున్నాను – జీవితంలో పూర్తిగా ఓడిపోయిన నేను ఆయనకు చేసిన ద్రోహాన్ని మర్చిపోలేదు – ఒక అమాయకుడి మనసులో అగ్ని రగిల్చినందుకు పశ్చాత్తాపపడ్డాను. ఆ విషయమై క్షమాపణలు చెప్పాలని వచ్చాను — కానీ నాపాపం నన్ను కట్టికుడిపింది.

ఓనాగు నా శీలాన్ని కాటువేసింది. అతనెవరయినదీ, ఎందుకలా చేసినదీ తెలియదు. నేను చేసిన పాపమే ఆ రూపంలో వచ్చిందనుకున్నాను. నన్ను క్షమించండి – మళ్ళీ మీకు నాముఖం చూపించను. మీకేకాదు ఈలోకానికి మాత్రం యేమని చూపించగలను ? ఆనందరావుగార్కి నా హృదయపూర్వక నమస్కారములందజేయండి.

—సుందరి.

ఉత్తరం చదివి ఆలోచనల్లో పడింది వర్ధని. ఆ సమయంలో ఆమెకు రాణి గుర్తుకొచ్చింది. ఆరోజు హాస్పిటల్లో చూడ్డమే. తర్వాతామెను కల్సుకోలేదు. కల్సుకునే అవకాశామూ కలుగలేదు. ఆనందరావు ఆమెపట్ల యిప్పుడిప్పుడే సుముఖంగా వున్నట్లు తెలుస్తోంది. మళ్ళీ యిప్పుడీ సుందరి రావటమేమిటో తనింట్లో ఆమెకు అన్యాయం జరగటమేమిటో వూహాకందని విషయంగా తయారైంది.

* * *

ఊరికి వెళ్ళివచ్చిందగ్గరనుండి ప్రసాద్ అదోలా వుంటున్నాడు. ఆ ముసలావిడ బాగానేవుందిగాని ఆస్తి పంపకాల్లో మళ్లీ మార్పులు జరిగాయి. మాణిక్యాంబగార్కి రాసిన వాటాలో సగం రాజేశ్వరి పేర్న రాసి మిగతాది అమ్మకానికి పెట్టి బేంక్ లో వెయ్యాలని మాధవరావుగారి వూహ. చనిపోయిన పిల్ల ఆత్మకు శాంతి కలగదండీ అని మహాలక్ష్మమ్మగారు ఒకటేపోరు.

"వాళ్లకేమే-పెద్దాడు వుద్యోగం చేసుకుంటున్నాడు. వర్ధని బాధ్యత అబ్బాయి ఎలాగూ చూస్తున్నాడు. యిక ఆ కుర్రకుంకలంటావా వాళ్లకొరకు పెట్టేదేమిటి?" ఈ ధోరణిలో సాగుతుంది మాధవరావుగారి వాదన. స్వయంగా వినకపోయినా ఆ మాటలు ఆ నోటా యీ నోటా పడి ప్రసాద్ చెవిన పడకపోలేదు. ముందునుంచీ ఆస్తిమీద ఆశ పెట్టుకోకపోయినా కలిగిన తాతగారు ఆమాత్రం తనకు సాయం చేయలేకపోతాడా అని అప్పులు చేశాడు. అవికూడా అవసరం మేరకు చేసినవే. తల్లి తాతగారింట వున్నా కూడ పంపేవాడు తను. ఆమెకు అనారోగ్యంగా వున్నపుడు అప్పుజేసి రెండు మూడు సార్లు తిరిగాడు. కంటికి కనుపించని ఖర్చెంతో అయింది. ఇప్పుడీ ఆశకూడ లేదు. ఏమైనా తల్లితోపాటే అన్నీ పోయాయి. అభిమానాలు పోయినా అనుబంధం మాత్రం ఎక్కడికిపోతుంది ?

'అన్నయ్యా' అంటూ నెమ్మదిగా నసుగుతూ నిల్చున్న వాసు వంక చూశాడు ప్రసాద్.

'పోర్టులో కళాసీ వుద్యోగాలేవో ఖాళీ వున్నాయటన్నయ్యా. ఎంప్లాయిమెంటు నుంచి పేరు తెచ్చుకుంటే మామయ్య చూస్తాన్నారు. ఒక వందైనా ఖర్చుపెట్టందే పేరు రాదంటున్నారంతా."

"నాకేంతెలీదురా. ఎలాఛస్తారో చావండి. ఎవడికాళ్లమీద వాడు బతికేట్టు ఆయనగారితో దెబ్బలాడి వచ్చేశారు. ఇప్పుడు నేనేం చెయ్యలేను. ఉద్యోగం లేకపోతే రిక్షాలాక్కు బతకండి పోయే పరువేం లేదు'

వాసు మారు మాట్లాడకుండా వచ్చేశాడు. సెప్టెంబరు పరీక్షలు వ్రాసింది మొదలు వుద్యోగాన్వేషణలోనే పడ్డాడతను. ఏదో ఒక స్థిరమైన ఉద్యోగం దొరికితే చాలనుకుంటున్నాడు కాలేజీ చదువులు చదివే శక్తి ఎలానూ లేదు మరొకరి సహాయంతో చదివేకంటె బంట్రోతు పని చేసుకు బ్రతకడమే నయమనుకున్నాడు.

కొత్త సీరియల్

# 'శ్రావణ సంధ్య'

ఆడదానికి సమాన ప్రతిపత్తి యిస్తున్నా మని బుకాయించే శిష్టసమాజం ఆమెకు నిజంగా యిస్తున్నదేమిటి? ఆధునిక మహిళ మనస్తత్వాన్ని, ఆమెపట్ల యీ సంఘంలోని పెద్దమనుషుల దృక్పధాన్ని ఉత్కంఠాభరితంగా విశ్లేషించిన నవల. ప్రారంభ సంచిక తేదీ పై వారం. —సం.

ఈ మధ్య ఆ అబ్బాయి మరోటే కూడా విన్నాడు కళాసేవనికి ఎస్సెసీ పాసై వుండకూడదూ అని. అందుకే రిజల్ట్స్ వచ్చే లోగా వుద్యోగం సంపాదించాలనే పట్టుదలతో వున్నాడు.

వంటగదిలోవుండే అంతా విన్నది వర్షని. ప్రసాద్ పరిస్థితుల్లో అతనలా విసుక్కోడం లోనూ తప్పుకన్పించడంలేదు. ఇటు వాసుసంగతీ అలానే వుంది. మాట సాయమంటే చేయ

## రా గ వీ చి క లు

గలరుగాని డబ్బు సాయమెవరు చేసారు? తనుకూడా ఏమీ చేసే స్థితిలోలేదు. ఉద్యోగంలో చేరాక అన్నయ్య అప్పులు కొన్ని తాను తీర్చెయ్యాలనుకుంది. కానీ, అన్ని వస్తువుల ధరలూ ఒక్కసారి పెరగటంవల్ల రెండు నెలల తన జీతం కూడ వేన్నీళ్లకు చన్నీళ్లు తోడైనట్లు కలిసి ఖర్చయిందేగాని పైసా మిగలటంలేదు.

ఈ రోజు ఆఫీసులో మరో సంగతి కూడ విన్నది. షిప్పింగ్ కంపెనీ లాభాలు అంతంత మాత్రంగానే వుంటున్నాయని కొంతమంది వుద్యోగులను రిట్రెంచ్ చెయ్యాలనుకుంటు న్నారట- అదే జరిగితే ముందు వెళ్ళిపోయేది తనే.

వర్షనికి అత్యంతంగా తాతగారిమీద కోప మొచ్చింది. పిల్లలు వచ్చింది మొదలు ఒక్క వుత్తరంముక్కయినా రాయరేదు. పైసా పంపలేదు. పైగా అన్నీ వున్న రాజేశ్వరమ్మ కూతురుకి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారట. అసలు తమనీ స్థితికి తెచ్చింది ఆయనకాదూ? తండ్రికి దూరంచేసి ఏదో ఒరగబెడతానని యీ పరిస్థితికి దిగజార్చి అటు తండ్రికీ, ఇటు తల్లికి కూడా చెందని నిర్భాగ్యులను చేసి యేమైనాసరే యీ విషయాలన్నీ ముఖాముఖి తేల్చెయ్యాలనుకుంది.

## 22

ఆనందరావు వివాహం సింహాచలం కొండ మీద అతి నిరాడంబరంగ జరిగిపోయింది. ప్రత్యేక ఆహ్వానాలు లేకపోయినా ముఖ్యులు అనుకున్నవారు ఓ పాతికమంది వరకూ వచ్చారు.

మాధవరావుగారికీ పెళ్ళి సుతరామూ ఇష్టంలేదు. తనతో సంప్రదించకుండా ఒక నిర్ణయాని కొచ్చినందుకే ఆనందరావుపై అగ్గి బుగ్గయ్యారు. పెద్ద కొడుకు, రాజేశ్వరి కూడ ఆయన పక్షమే అయ్యారు. రాజశేఖరంగారు మాత్రం తన అభిప్రాయాన్ని బయటకు వ్యక్తపరచలేకపోయినా ఎలాగూ జరిగే పెళ్లి జరగక మానదని పెళ్లికిమాత్రం కుటుంబంతోసహా హాజరయ్యారు. ఒక వేళ కాదన్నా ఆనందరావు ఆగే పరిస్థితిలో లేడని ఆయన గ్రహించారు. కాకపోయినా పెళ్లి కూతురులోకూడ ఎంచదగ్గదేం ఆయనకు కన్పించలేదు. పిల్ల బావుంది. ఈడూజోడూ కూడ కుదిరింది.

ఇక పెళ్లికి కావల్సిన యేర్పాట్లన్నీ ప్రసాదు వర్ధని చేశారు. రజనీకాంత్‌కూడ వారికుటుంబంలో ఒకడిగా శ్రమపడ్డాడు. పెళ్లి ఫోటో లన్నీ అతనే తీశాడు. కలిపి, విడివిడిగా ఆ కుటుంబ సభ్యులకు ఫోటోలు తీశాడు.

భోజనాలయ్యాక తాంబూలం తీసుకుని బయలుదేరారు రాజశేఖరంగారు. ఆనందరావు గాని మరెవ్వరుగాని అభ్యంతరం చెప్పలేదు. సమయానికి వచ్చి పెద్దరికం వహించి నందుకే సంతోషించారంతా.

కొత్త దంపతు లక్కడే మరో మూడు రోజులు వుండేందుకు అన్ని యేర్పాట్లు చేయబడ్డాయి. టౌన్‌లో ఓ చక్కని పోర్షన్‌కూడ అద్దెకు తీసుకున్నాడు ఆనందరావు.

(ఇంకా వుంది)

రచనలతోపాటు హామీపత్రం పెట్టి తీరాలి. రచనలన్నీ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, విజయవాడ – 520003. అన్న చిరునామాకి పంపాలి. సం.



# హైదరాబాద్ నోట్ బుక్

### సంస్కృత దినోత్సవం :

సంస్కృత దినోత్సవం జంటనగరాలలోని ప్రాచ్య కళాశాలలో ఆగస్టు 21న వైభవోపేతంగ జరిగింది. నల్లకుంటలోని ఆంధ్ర ప్రాచ్య కళాశాలలో జరిగిన ఉత్సవానికి అధ్యక్షతవహించిన డాక్టర్ ఎన్. కులశేఖరరావు సంస్కృత భాష భారతీయ సంస్కృతికి మూలకందమని, కనుక సంస్కృతి అవగాహనకు సంస్కృతభాషాధ్యయనం ఆవశ్యకమన్నారు. సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ప్రసంగిస్తూ 'నేడు తెలుగు అధికార భాష అయింది గనుక, దాని అభివృద్ధికి సంస్కృత భాషాధ్యయనం అత్యవసరమని, సోదాహరణంగా గంటన్నర సేపు ప్రసంగించారు. ప్రారంభంలో శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రి వైదిక ప్రార్థన చేసిన తర్వాత కళాశాల నిర్వాహక సంఘాధ్యక్షులు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం వక్తను పరిచయం చేశారు. కళాశాల ప్రిన్సిపాలు శ్రీ ఎస్. విశ్వనాథశర్మ సంస్కృత దినోత్సవం ఆవశ్యకతను, ప్రాధాన్యాన్ని గురించి ప్రసంగించారు. శ్రీ శేషగోవర్ధనం రామానుజాచార్యుల కృతజ్ఞత వందనాలతో ఉత్సవం సమాప్తమైంది.

### కాస్మాపాలిటన్ ఎంప్లాయీస్ కల్చరల్ అసోసియేషన్ :

కాస్మాపాలిటన్ ఎంప్లాయీస్ కల్చరల్ అసోసియేషన్ లాంఛన ప్రాయమైన ప్రారంభోత్సవం మంత్రి డాక్టర్ దేవానందరావు ఆగస్టు 25న రవీంద్రభారతిలో జరుపుతూ, పై సంఘం తన లక్ష్యాలకు అనుగుణంగా కార్యకలాపాలు సాగించగలదన్నారు. కుమారి లీలావతి ప్రార్థనానంతరం సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ యు. గోపాలకృష్ణమూర్తి నివేదిక చదివారు. కనకారావు బృందం లలిత సంగీత ప్రదర్శనం శ్రీ బోస్‌చే ధ్వన్యనుకరణ ప్రదర్శనం, ప్రొఫెసర్ కుమార్‌చే గారడీ ప్రదర్శనం, గణేష్‌పాత్రో రచించిన "త్రివేణి" నాటిక ప్రదర్శనం జరిగాయి. నాటికలో శ్రీయుతులు ఎం. వి. శర్మ, ఎం. పూర్ణచంద్రరావు, ఆర్. ఎస్. పి. ఆంజనేయశర్మ, ఎం. ఎస్. సుబ్రహ్మణ్యశర్మ, మోహనరావు పాల్గొన్నారు. ప్రారంభంలో సంఘాధ్యక్షుడు శ్రీ శ్రీనివాసరావు స్వాగత వచనాలు పలికారు.

### రజనీఆర్ట్స్ సాంస్కృతిక ప్రదర్శన:

సంజీవరెడ్డినగర్ రజనీ ఆర్ట్స్ వారు ఆగస్టు 26న రవీంద్ర భారతిలో జరిపిన సాంస్కృతిక ప్రదర్శనం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించింది. శ్రీ ఎస్. సాంబశివశివరావు మయసభలో దుర్యోధనుడు ఏకపాత్రాభినయం, శ్రీ ఎ. ఎస్. ఎన్. మూర్తి దర్శకత్వాన ఆదివిష్ణు 'చూడు చూడు నీడలు' నాటిక ప్రదర్శనం. కుమారి జి. వి. నిఖిలేల భరతనాట్య ప్రదర్శనం లలిత సంగీతం విశేషాలు లలిత సంగీతంలో ప్రముఖ న్యాయవాది కోకా రాఘవరావు రచించిన "నిదురపో నిదురపో" గేయాన్ని మనీషా హర్డికర్ చాల మధురంగా పాడారు. దీనికి స్వరకల్పన శ్రీ పి. వి. సాయిబాబా సుందరంగారు సమర్థంగాను చేశారు.

### మఖ్దూం రచనలు:

"మఖ్దూం రచనలు, ఆయన త్యాగాలు నేటికీ యువకులకు ఉత్తేజకరమైనవే" అని ఆంధ్రప్రదేశ్ అంజుమాన్ తరక్కి ఉరుదు అధ్యక్షుడు మీర్ అహమద్ ఆలీఖాన్ ఆగస్టు 27న మఖ్దూం ఆరవ వర్ధంతినాడు అన్నమాటలలో యధార్థం ఉంది. మఖ్దూం ఉద్యోగంలోనే వుంటే ఇప్పటికి ఏ గవర్నరో, మరేదో అయ్యేవాడు. ఆయన జీవితం త్యాగమయం, రచనలు నిరంతరం. ఉద్రేకాలు ప్రజాస్వామ్యంపై ఆయన ప్రేమ అపారం. ఆయన రచనలన్నీ తెలుగులోకి ఏ. రాధాకృష్ణమూర్తి వంటి వివిధ సంస్కృతి జిజ్ఞాసువు యధారధంగా చేయాలి.

### ఉపశ్రుతి :

"ఏమండీ ! సినిమా కవులంతా తాము సామ్యవాదులమంటున్నారు. ప్రజానాయకులేమో తాము సామ్యవాదులమంటున్నారు. భూస్వాములేమో తమదీ సామ్యవాదమేనంటున్నారు. ఎవరిదండీ సిసలైనది ?" అని ప్రశ్నించాడు ఒక శ్రోత నన్ను ఒక బహిరంగ సభలో. సరైన సమాధానం కోసం తటపటాయిస్తున్నాను. ఇంతలో ప్రక్కనున్నమరొక శ్రోత అన్నాడుగదా— "కవులదేమో స్వామివాదం. వారు తమ కావ్యాలను ఇతర స్వాములకు అంకిత మిస్తారు గనుక. తక్కిన వారిది స్వామ్యవాదం"

—తిరుమల రామచంద్ర

ఆ దినం టపాలో రెండుత్త రాలు వచ్చాయి.

ఒకటి శ్రీమతి దగ్గిర నుండి. ఆత్రంగా దాన్ని విప్పాను. పెళ్ళయిన చాలా కొత్తలోని అనుభవం మరి! జానకి రెగ్యులర్‌గా వారానికి రెండుత్తరాలు వ్రాస్తుంది. అవి నాకు చేరడానికి కనీసం వారం రోజులు పడతాయి! ఉత్తరం చదవగానే, గాల్లోకి ఎగిరి జానకి ముందు వాలాలనే ఉత్సాహం కట్లు తెంచుకొని పరవళ్లు తొక్కుతుంది! దానికి ఇంకో బలమైన కారణం ఓటుంది. (అంటే రెక్కలే కట్టుకుని, గాల్లోనే ఎగరాలనే ఆలోచనకు) ఈ పల్లెటూరు నుండి పన్నెండు మైళ్ల దూరాన ఉన్న బస్సు స్టాండుకు పోవడానికి ఒక ఉధృతంగా పారే ఏరు, నెమ్మదిగా, నిదానంగా, లోతుగా ప్రవహించే వాగు, పగలే భయపెట్టే జీబురు లాంటి రెండు మైళ్ల అడివి డొంకలో, తుప్పల మధ్య ప్రయాణం చేయాలి!!

ఇన్ని కష్టాలుపడి ఉస్సురుమని బస్సు స్టాండుకు చేరినా, బస్సు వెళ్లిపోతే తిరిగి మర్నాడుదయం వరకూ చలిలో...చీకటిలో... ఎవరూ పరిచయంలేని ఆ చిన్న పల్లెటూరిలో గడపాలి! హారిబుల్!!

ఈ చిన్న మారుమూల పల్లెటూళ్లో ఉద్యోగం దొరికినందుకు నే నెంతో సంతోషించాను! జానకి సరేసరి! మా అమ్మానాన్నలు "కోడలు ఇంట్లో కాలు పెట్టిన వేళ" అని సంబర పడ్డారు!– ఉద్యోగం అవగానే ఇద్దరం కలిసి కొత్త కాపురం వెలిగిద్దామన్న ఆశలు అడియాసలయ్యాయి!

ప్రభుత్వంవారికి దేశాన్నంతా ఒక్కరోజులో విద్యా విజ్ఞానాలతో నింపిపారేయాలనీ...ఉన్న జనాభా అంతా అక్షరాస్యులై పోవాలనీ అన్న ఆలోచన ఉండడం హర్షింపదగ్గదే! అభినందించ దగిందే! చీమలు ... కాకులు దూరని చిట్టడువుల్లో సైతం విజ్ఞాన బీజాలు నాటాలన్న ఆలోచన ఓహ్! చాలా గొప్పదే గానీ, నాలాంటి వాళ్లకు మాత్రం అది ఆశనిపాతంలాగా...క్రూరమైన శాపంలా అనిపించడంలో వింతేమీలేదు! కనీసం బయట ప్రపంచంతో సంబంధం లేకుండా...చుట్టూ ఏం జరుగుతుందో తెలుసుకునే వీల్లేని ద్వీపాల్లాంటి చోట పడ్డేసే నాలాంటి వాళ్ళు అలా అనుకోవడంలో తప్పేమీలేదు!

అయితే నేను పరిస్థితుల్ని చూసి కృంగిపోయే రకం మనిషిని కాను! ఇక్కడికి వచ్చి రాగానే పరిస్థితులన్నీ సర్వే చేశాను. నాకు నా చిన్నపుడు చదివిన కథ ఓటి జ్ఞాపకం వస్తూ ఉంటుంది! శాస్త్రజ్ఞు లందరూ దేవుణ్ని నమ్మకుండా నాస్తికులుగా మారిపోయినందుకు ఓ దినం దేవుడు కోపగించుకుని వాళ్లందర్నీ పిలిచి, వాళ్లకు "శిక్ష" గా అందర్నీ "నరకం" లోకి తోసేసాడట! ఆ "నరకం" లో అసలు ఉండడానికి వీలులేదట! ఎక్కడ చూసినా బుసబుసమని పొంగే లావా...చిత్తడినేలలు పొగ... క్రూరమృగాలు, రాళ్లు, రప్పలు...! ఓ సంవత్సరం గడిచిన తర్వాత శాస్త్రజ్ఞులు ఎలా ఉన్నారో చూద్దామని దేవుడు "నరకం"లోకి పోయేసరికి అక్కడ ఏముంది? అందరూ హాయిగా ఇళ్లు కట్టుకుని, జలపాతాలు మళ్ళించి, అగ్నిగుండాలను ఆర్పి, చక్కటి సేద్యంచేసి, క్రూర జంతువులను మచ్చిక చేసుకుని హాయిగా బ్రతుకుతున్నారట!?




నేను మొట్టమొదట, అక్కడి గ్రామస్తులను సమావేశపరచి విద్యయొక్క ఆవశ్యకతను గురించి చెప్పాను. అందరి సహాయంతో ఒక చక్కటి తాటాకులపాక వేయించాను! దాని గోడలకు పూత పెట్టించాను. బావి పూడిక తీయించి గిలక వేయించాను! బడిచుట్టూ

## శ్రమ ఫలితం

"ఫెన్సింగు" ఏర్పాటు చేయించి పూల మొక్కలు నాటించాను! ఒకగంట ... అది మ్రోగగానే అందరు పిల్లలు తప్పకుండా హాజరవడం, ఓపిగ్గా చెప్పింది చదవడం, వ్రాయడం అలవాటు చేయించాను!

ఇన్నిపనులు నేను చేసిన తర్వాత ఆ చిన్న ఊరివాళ్ళు నాకు బ్రహ్మరథం పట్టినంత పనిచేశారు! నేనుండే ఇల్లు వాకిలి శుభ్రం చేశారు? నాకు లోటనేది లేకుండా చేయడంలో వాళ్ళు కృత కృత్యులయ్యారు! పాలు, పెరుగు, పనిమనిషి, కూరలు వారానికోసారి ప్రక్కపల్లెలో జరిగే సంతనుండి నాక్కావలసిన సరంజామా తెచ్చిపెట్టడం అలవాటు చేసుకున్నారు!

నాకిప్పుడు హాయిగా ఉంది. ఓపదిరోజుల్లో వచ్చి నిన్నిక్కడికి కాపరానికి తీసుకువస్తానని జానకికి ఉత్తరం వ్రాశాను! ఆ ఉత్తరానికి ఈ సమాధానం!

ప్రియమైన శ్రీవారికి—

మీ ఉత్తరం అందినది. ఇక్కడ అందరూ క్షేమం! మీ ఆరోగ్యం గురించే మా బెంగ? మీరు వ్రాసిన విషయాలవల్ల అక్కడ అన్ని విధాలా వసతిగా ఉందని తెలిసి చాలా సంతోషించినాము. అత్తయ్య కూడా విషయాలు తెలిసి సంతోషించినది. మీరాకకోసమే ఎదురు చూస్తుంటాను సెలవ్. —మీ జానకి.

ఉత్తరాన్ని నాలుగుసార్లు చదివాను. నాలుగుసార్లూ జానకి నాలుగు భంగిమల్లో నా ఊహల్లో కనిపించింది.

రెండో ఉత్తరం సర్కారు వారిది!

ఉత్తరం చించాను! గుండె దడదడకొట్టుకుంది... జిల్లా విద్యాశాఖాధికారిగారు ఈ చిన్న పాఠశాలను తనిఖీ చేయడానికి వస్తున్నారు! తారీఖు చూశాను. ఇరవయ్యవ తారీఖునాడు! అంటే రేపే! ఉద్యోగంలోచేరి పట్టుమని నాలుగునెల్లయినా కాలేదు... అప్పుడే ఇన్‌స్పెక్షను... ఏంచెయ్యాలో... ఏం చేస్తారో అర్థంకాక సతమత మయ్యాను! స్కూలు బాగానే నడుస్తున్నది... పిల్లలు చక్కగా వస్తున్నారు... చదువుకుంటున్నారు!

సాయంత్రం ఊరివాళ్ళతో విషయం చెప్పాను!

విషయం విన్నతర్వాత వాళ్లలో ఒక విధమైన ఉత్సాహం కలగడం చూసి, నేను ధైర్యం తెచ్చుకున్నాను!

"మీకేందిసార్! అన్నీ మేం జూస్కుంటం గద! ఏందిర ఈరసామి రేపటికి నాల్గురకాల కూరగాయలు జమచెయ్యి..."

రంగన్న మంచి కలుపుగోలు మనిషి. ఏ సమస్యనయినా ఇట్టే అవలీలగా పరిష్కరించ గలడు! అందరికీ అన్నిరకాల పురమాయింపులూ పురమాయిస్తున్నాడు!

"వెంకటేశం... నాలుగుసేర్ల పాలు... చిక్కటివి, రంగత్తతోనిచెప్పి తీసకరా "బురూ" కాఫీసీసా కోవటి లచ్చయ్యకొట్లో అడక్కురా..."

టకటకమని ఏర్పాట్లు జరిగిపోతున్నాయి... ప్రొద్దున్నే స్నానం చేయడానికి వేడినీళ్ళదగ్గరనుండి, భోజనాలు... విశ్రాంతి సర్వం ఏర్పాట్లు జరిగాయి!

* * *

ఉదయం జీపులో డి. ఇ. వో., వెంట ప్రెప్రాసి దిగారు! వాళ్ళకి డొంకలోనే రంగన్న స్వాగతం చెప్పాడు! డి. ఇ. వో. బాగావయసు మీరినవాడు. బట్టతలమీది రాలిపోని నాలుగు పీచులాంటి వెంట్రుకలను మాటిమాటికీ సర్దుకోవడం ఆయన హాబీ!

బంతిపూలు తలలూపుతుండగా ఆయన మా స్కూలంతా తిరిగి చూశాడు! పిల్లలందరూ 'నమస్తే' చెప్పారు! వ్రాయమన్నవి వ్రాసి చూపారు! ఆయన ముచ్చటగా ఓ చిన్న పిల్లవాడ్ని ఎత్తుకొని ముద్దులాడాడు!

భోజనాల ఏర్పాట్లు చూసి బాగా ఆశ్చర్యపడ్డట్లు ఆయన మొహమే చెబుతోంది! గడ్డ పెరుగు, తాజాకూరగాయలు... గ్రుడ్లు... పప్పు... ఊరివాళ్లనీ... నన్నూ అభినందిస్తూ ఆయన తాపీగా భోజనం చేశాడు!

సాయంత్రం టిఫిన్. కాఫీలయిన తర్వాత ఊరివాళ్లతో చిన్న సమావేశం ఓటి ఏర్పాటు చేసి, నన్నూ... నా కృషినీ, ఊరివాళ్ల సహకారాన్నీ చాలాసేపు పొగిడాడు! నాకు కలిగిన సంతోషం అంతా యింతా కాదు!

కృతజ్ఞతా పూర్వకంగా రంగన్నా... మిగతా ఊరివాళ్లవేపు చూశాను.

చీకటి పడింది—

ఇక్కడ చలి బాగా ఎక్కువ... డి.ఇ.వో. గారికి భోజనానంతరం మెత్తటి పడక ఏర్పాటు చేశాను. పడక ప్రక్కనే వెచ్చగా ఉండడానికి రంగయ్య 'సెగడు' ఏర్పాటు చేశాడు. డి. ఇ. వో. గారు సంతృప్తిగా

మంచంమీద కూర్చుని నన్ను చాలాసేపు ప్రశంసించారు.

"అబ్బాయ్! అందరూ నీలాంటి ఉపాధ్యాయులే ఉంటే ఇక దేశానికి కావలసిందేముందోయ్! డ్యూటీ సరిగా చేయాలనీ... తద్వారా ఆనందం పొందాలనే ఆలోచన ఇప్పటి తరంలో చాలామందిలో నాక్కనిపించడం లేదు. అలా ఉన్నట్లయితే టీచర్లు ఫలానా చోట సరిగా పని చేయడం లేదనే అపవాదు రాకపోయేది. ఐ లైక్ యు వెరీ మచ్! యు ఆర్ ఎ బార్న్ టీచర్! యాన్ ఎగ్జాం—పుల్... అండ్ ఎ హానెస్ట్ మోడల్ టీచర్...

అపుడే బయట ఎవరిదో అపరిచితుని గొంతూ... రంగన్న గొంతూ వినిపించింది...

"ఎవరది?"

"యెవరోనండి... డి. ఇ. వో. గారితో మాట్లాడ్తరట!!"

"రమ్మను... లోపలికి రమ్మను"

# శ్రమ ఫలితం

చలికి చెవులకు బిగుతుగా మఫ్లరు చుట్టు కున్న వ్యక్తి లోపలికి వచ్చాడు పైజామా, లాల్చి వేసుకున్నాడు. అవి దుమ్ము కొట్టుకుని ఉన్నాయి. రాగానే డి. ఇ. వో. గారికి నమస్కారం చేశాడు. డి. ఇ. వో. గారు అతన్ని వెంటనే గుర్తుపట్టేశాడు.

"హార్నీ... నువ్వా తిరుమలయ్యా! నువ్వింకా..."

"చిత్తం ! బంజర్లోనే నా పోస్టు...!"

"మరి... అన్నట్టు నువు సరిగా అక్కడికి పోతున్నావా?!"

"నేను పోలేనండి !"

"ఏం!?"

"కారణాలు మీ కింతకుముందు చాలా సార్లు నోటిద్వారా, అప్లికేషనుద్వారా మనవి చేశాను. ఇక్కడినుంచి ఇంకో పదిహేను మైళ్ళు నడిస్తేనేగాని 'బంజరు' రాదు. దానిమీద ఈ ఊరు చాలా నయం. అక్కడి వాళ్లు మూర్ఖులు... అయినా అక్కడ స్కూలెందుకుసార్? యాభై ఇళ్లు కూడా లేవు... అక్కడ స్కూలా ? నరమానవుడన్న వాడెవడూ అక్కడ పన్జేయలేడు."

"ఏం? ఎందుకు? వై? నువ్వు జీతం తీసుకుంటున్నప్పుడు ఎక్కడయినా పన్జెయ్యాల. అది రూలు."

"రూలేమిటి సార్. అసలక్కడ పిల్లలు లేందే?"

"ఏమిటీ? ఊర్లో పిల్లలు లేరా?"

"అవును... నేను చెబుతున్నాను గదండీ! యాభై ఇండ్లలో కలిసి మొత్తం తొమ్మిది మంది మాత్రమే పిల్లలున్నది... అదీగాక వాళ్ళు ఆ తొమ్మిదిమందినీ స్కూలుకు పంపరట ! పొలం పనులూ... బర్రెలూ కాయడానికీ వాళ్లని పంపుకుంటారట! ఇంకోసారి గనక నే నక్కడికిపోయి బడి తెరిస్తే నా కాళ్లు విరిచేస్తామని వాళ్లు నామీదికొచ్చారు !"

"నాన్సెన్స్! రిడిక్యులస్ ... ఇప్పటికి నీకు చాలాసార్లు ఎక్స్ప్లనేషన్లిచ్చాను...నీ కిష్టం లేకపోతే రిజైన్ చెయ్ !"

"నా మాట నమ్మకపోతే. ఇంత దూరం వచ్చారుగదా! ఇక్కడ్నుండి బంజర్ రండి ... మీరే స్వయంగా చూద్దురుగాని !"

"అంటే నీ ఉద్దేశ్యం ?"

"ఏముందిసార్!"

నేను వాళ్ల వాదన వినదలుచుకోక బయటకు వచ్చాను. బయట మంచు గుడిసెలను కప్పేస్తుంది. చంద్రుడు మంచులో తడిసి మసగ్గా వెలుగుతున్నాడు ! చల్లగా ఉంది. బంతిపూలు ఆ మసక వెలుతురులో మాగన్నుగా నిద్రపోతున్నాయి. సిగరెటు వెలిగించి పొగ ఊపిరితిత్తుల్లోకి పీలుస్తుంటే వెచ్చగా ఉంది !

"యూ మీన్ ... జీపురావడానికి త్రోవ లేదు కాబట్టి నన్ను నడిచి రావాలంటావు !"

"మీరు ఒక్కసారి రావడానికే అంత బాధపడితే నేను అక్కడే ఉండి పన్జేయడం ఎలాఉంటుందో ఆలోచించండి సార్ ! ఆ ఊరి వాళ్లకూ...నాకూ పడదు !దయచేసి నన్ను ట్రాన్స్ఫర్ చేయండి...అంతే !!"

తిరుమలయ్య బయటకు వచ్చాడు, నేనతన్ని తీసుకొని ఇంట్లోకి వచ్చా ! "మీరేనా ఇక్కడ పన్జేసేది. వరస్ట్...సర్వీసు తక్కువ కాబట్టి మీకు తెలియదు. డర్టీ... నాస్టీ జాబ్ ?"

తిరుమలయ్య ఆదినం నాదగ్గరే బస చేశాడు !

తెల్లవారింది—

డి. ఇ. వో. గారి జీపు బయలుదేరింది. మేం డొంకదాకా సాగనంపి వీడ్కోలు చెప్పాం! తిరుమలయ్య కాలిబాటన వెళ్లిపోయాడు !

వారంరోజులకు — జిల్లాపరిషత్ ఆఫీసు నుండి నన్ను బంజరుకు ట్రాన్స్ఫర్ చేస్తున్నట్లు... నాస్థలంలో తిరుమలయ్యను వేస్తున్నట్లు ఆర్డర్లు వచ్చాయి !

కారణం తెలీక నేను డి. ఇ. వో. ఆఫీసుకు పరుగెత్తాను ! ఆయన బట్టతలమీద పేమను రెండుసార్లు తడుముకుని, నన్ను కూర్చోమని కుర్చీచూపించి కారణం చెప్పాడు !

"మాడబ్బాయ్ ! నువ్వు ఘటికుడివి ! "మాడల్" టీచరివి ? నీలాంటి వాళ్ళు ఎక్కడున్నా రాణించగలరు ... కాబట్టి ఆ "అన్వాంటెడ్" తిరుమలయ్యను నీ స్థలంలో వేయించాను. అయినా నీకేం భయం ! ఏటికి ఎదురీదగల సమర్థుడివి ! నీ "కెపాసిటీస్" నాకు తెలుసు. నీలాంటి వాళ్ళు డిపార్టుమెంటుకే గర్వకారణం ! ఏమంటావ్ ?!

ఏమనగలను ?

జానికికి ఇప్పట్లో రానవసరం లేదని ఉత్తరంవ్రాసి పోస్టులో ఎడేశాను!

# అవీ ఇవీ అన్నీ

**ఆలోచనాలోచనాలు**

డా. దాశరథి కవిత్వం గంభీరమూ, ఉదాత్తమైనదైయ్యుండి కూడా సామాన్య మనిషి గుండెల్లో నాటుకుంటుంది. విలక్షణమైన ఆయన ధోరణి యీ సంపుటంలోని కవితా ఖండిక అన్నింటా అగపడుతుంది. శీర్షికలు పెట్టడంలో 'దాశరథి కి' ఆయనే సాటి "తుషారక్రీడ", "వెలుగుల వంతెన" "గజదంత గోపురం", "మధుజ్వాల" లాంటి మంచి కవితలెన్నో వున్న 112 పుటల యీ సంపుటాన్ని ముఖ్యమంత్రి జలగం వారికి కవి అంకితం చేసారు. మంచి గెటప్ గల దీనివెల 5 రూపాయలు. ప్రతులు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్లు — సికింద్రాబాదు 3.

**నవ్యాంధ్ర**

ఆంధ్రప్రదేశ్ చరిత్ర; వాఙ్మయం నైసర్గిక స్వరూపం జిల్లాలవారీ విశేషాలు మున్నగు ఎన్నో అంశాలను పొందుపరచిన 'నవ్యాంధ్ర' గ్రంథంలో 282 పుట లున్నాయి. రాష్ట్రం గురించి ఒకే పుస్తకంలో అన్ని అంశాలు సంగ్రహంగా చదువదలచేవారికి ఎంతో ఉపయుక్తంకాగల ఈ పుస్తకం వెల 12 రూపాయలు. రచయిత : శ్రీ గొట్టిపాటి కొండప నాయుడు. ప్రచురణ : కవితా ప్రచురణాలయం, సత్రం వీధి, కావలి, నెల్లూరుజిల్లా.

**యువ జగతి**

శ్రీ కె. ఎ. శర్మ సంపాదకత్వంలో వెలువడిన యువజగతి పక్షపత్రిక నాలుగవ సంచిక అందింది. 20 పేజీలు, వెల 50 పైసలు. వివరాలకు : యువజగతి, కొడుకుల వారిసందు, అనకాపల్లి—531002.

# ఫాలాక్షుని డైరీ






## త్రిశంకు స్వర్గం

1990 నాటికి భూమికి, చంద్రునికి వున్న దూరంలో మధ్యభాగంలో వున్న గ్రహంమీద (!) మానవుడు ఎంచక్కా ఇల్లు కట్టుకోవచ్చని, ఇది వూహ, ఆశకు చెప్పే కల్పనాకాదని, పచ్చి నిజమని అమెరికన్ స్పేస్ శాస్త్ర నిపుణులు అన్నారట. స్పేస్ (?) లో 384,000 కిలోమీటర్ల దూరంలో చంద్రుడూ, భూమికి మధ్య దూరంలో పదివేలమందైనా సుమారు నివసించడానికి వీలైన ఇళ్లు లవీ కట్టుకునే ఏర్పాట్లు 1990 నాటికి ఫలిస్తాయని డాక్టర్ వోనెల్ అన్నారట. మీకేమైనా అక్కడో ఎకరంబాతిక కావాలా ! ! హ్వాద్నా !!

## ప్రియునిభార్యనుహత్యచేసిన ప్రియురాలు!

కర్నూలుకు చెందిన ముప్పయ్యేళ్ల వోబులమ్మ త. ం ఉంచుకున్న తిమ్మారెడ్డి తనను పెళ్లి చేసుకోకుండా శివమ్మ అనే ఆమెను పెళ్లి చేసుకున్నాడనే క్రోధం, కోపావేశాలతో వాళ్లింటికి వెళ్లి, శివమ్మను కత్తితో ఎనిమిది చోట్ల పొడిచి చంపేసిందట. పిమ్మట తానూ ఆత్మహత్యకు పూనుకొని, చట్టానికి దొరికిపోయిందట. కోర్టువారు ఈమెకు హత్య, ఆత్మహత్య నేరాలమీద శిక్షలు విధించారట.

## ఇత్తడి బిందెలో బంగారు నాణాలు !

రాజమండ్రికి సుమారిరవై మైళ్ల దూరంలో ఉన్న తిరుమాలయపాలెం అనే వూళ్లో కొంత మంది పనివాళ్లు కొండ వద్ద రాళ్లను పగుల గొడుతుండగా వారికో ఇత్తడి బిందె దొరికిందట. లోపలున్న బంగారు నాణాలను పనివారంతా న్యాయంగా పంచేసుకున్నారట. ఈ విషయం తెలిసిన గ్రామ మున్సబు తన వాటాగా ప్రతి పని వాని వద్ద ప ... నాణాలు చొప్పున తాను ఒడికేసుకున్నాడట. ఇది జరిగిన నెలన్నరకి విషయం తెలిసిన పోలీసులా వూరెళ్లి వాళ్ళందరి వద్ద నుంచి మొత్తం 330 నాణాలనూ లాక్కుని ఆ మునసబు గారి మీద తదితరుల మీదా కేసు బనాయించారట.

## కోతిని పట్టుకున్నవారికి బహుమానం !

పూనాలో ఒక కోతి వీధినపడి, ఇళ్ళు, కొట్లు బజార్లు అన్నీ బీభత్సం చేస్తూ, అలనాటి కంసుణ్ని గుర్తు తెస్తూ, అంతలో ఆగక వో మనిషిని పీకి, చంపేసిందట కూడాను. ఈ కోతిని పట్టుకోలేక, ఇహ మార్గాంతరమూ లేక, కోతిని పట్టినవానికి ఎనిమిదొందల రూపాయలు ఇస్తామని కొన్సిలరుగారన్నారట. తీరా అన్నాక, ఇది ఏ ఎక్కవుంటులో తీసుకోవాలీ అనేది బాధ పడక, సరి, అంటగామునిసిపాలిటీ కాదంటే ప్రజల నుంచి ఆ డబ్బు చందాలైనా వసూలు చేస్తానని ఆయన అన్నారట— సెహబాష్!!

## నగలకోసం వృద్ధురాలి హత్య

శ్రీకాకుళంలో వో బావి ప్రక్కన ఎనభయి ఏళ్లావిడ శవం పడుందట. ఆవిడ వైశ్య స్త్రీ అని, మెడలో ముత్యాల హారం, పగడాల దండ, వగైరాలు ఏడు వేలు విలువ చేసే నగలు ఆవిడ వంటిమీదుండాల్సినవి లేవని, యీ నగలకోసమే ఆవిడని ఎవరో కొట్టి చంపి, అక్కడ పారేసి ఉండి ఉండాలని పోలీసు అన్నదట.

## 10కోట్లు బాకీపడ్డ సారా వ్యాపారులు!

సారా వ్యాపారులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి పది కోట్ల రూపాయలు బాకీ ఉన్నారని, ఆ బాకీలు వెంటనే వారంతా చెల్లించకపోతే కఠిన చర్య తీసుకోవలసి ఉంటుందని ఎక్సైజు మంత్రి పురుషోత్తమరెడ్డి పత్రికావిలేఖరులతో అన్నారట. మద్యపానం వారికి మద్యానికి ఏం సంబంధం!!

## సినిమాహాల్లో కరెంటు దొంగతనం !

కర్నూలులో వో థియేటరువారు కరెంట్‌ని దొంగ పద్ధతుల్లో వాడుకుంటున్న వైనం కనిపెట్టిన విద్యుత్ శాఖ ఆ హాలుకు తొంభయి ఒక్క వెయ్యి రూపాయలు ఫైను విధించారట. తొమ్మిది లక్షల్లో ఒక్కువ లక్షే!! బాబోయ్!!!

## వరదల్లో కొట్టుకుపోయిన రైలు !

ఆగస్టు పందొమ్మిదో తేదీన హైదరాబాద్ — హవురాల మధ్య ప్రయాణం చేసే ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ నాలుగొందల మంది ప్రయాణికులను ఎక్కించుకొని, వైతరణిరోడ్డు — మానురోడ్డు స్టేషనుల మధ్య వరదలలో కొట్టుకు పోయిందని ఖుర్దారోడ్డు నుంచి సౌత్ యీస్టరన్ రైల్వే శాఖ ప్రకటించిందట. విశ్వప్రయత్నం చేస్తున్నారట రైల్వే అధికారులంతా. పోయిన నాలుగొందలమందిలో ఎవ్వరూ దొరికినట్టు వార్తలులేదు.

## దొంగ బంగారం !

విశాఖ పట్టణానికి చెందిన జి. దాలినాయుడు అనే ఆయన తన ఇంట్లో ఎనిమిది లక్షల రూపాయల విలువచేసే 22 కిలోల బంగారం దాచుకున్నవైనం కనిపెట్టిన సెంట్రల్ ఎక్సైజుశాఖ ఆ బంగారాన్ని స్వాధీన పరచుకున్నదట.




## నూతన స్వయం వుపాధి పథకం

వో సంవత్సరం క్రితం కర్ణాటక రాజ్యంలోని కారెహళ్లికి చెందిన రంగశెట్టి అనే నిరుద్యోగి వో బ్యాంకు నుంచి వెయ్యి రూపాయలు అప్పు తీసుకుని వో యాభై గాడిదలను కొన్నాడట. కొబ్బరిచెట్టుకు గాడిదపెంట మంచి ఎరువని గ్రహించి అటంగ పెట్టి ఆ గాడిదకు రోజు ఒక్కింటికి పావలా అద్దె తీసుకుని ఎవరితోటలోనైనా కట్టేసేవాడట. ఆ తోటలో గడ్డి గాడిదతినరాదంటే గాడిదకు రూపాయి చార్జి చేసేవాడట. ఈ గాడిదలకు చాలా గిరాకి వచ్చిందని కొబ్బరితోటలు వేసుకున్నవారు ముందుగానే వాకిన్ని గాడిదలు కావాలోచ్ అని దరఖాస్తులు పెట్టుకునేస్థితి వచ్చేస్తోందని వో బ్యాంకు అధికారి అన్నాడట—హావుమేని డాంకీస్వామహా !!

## విజ్ఞానం — వికాసం

### రొద వడపోత

ఫ్యాక్టరీలలో యంత్రాలవల్ల, వీధులలోని రవాణావల్ల కలిగే రొదను పూర్తిగా లేకుండా చేయడం సాధ్యపడక పోయినా, కొంత వరకు తగ్గించడానికి డాక్టర్లు మానసిక శాస్త్రజ్ఞులు, సామాజిక శాస్త్రజ్ఞులు ప్రపంచమంతటా ఆలోచిస్తున్నారు.

అకడెమిషియన్ ఐ. పెత్రియనోవ్ — సోకోలోవ్ ఆధిపత్యాన, కొంత మంది సోవియట్ వైద్యశాస్త్రవేత్తలు రొదను వడుగ్గనడానికి బహు సులువైన సాధనాలను కనుగొన్నారు. అవి ఉల్లిపొర కాగితాల లాగా కనిపించే ధూళి వడపోత సాధనాలు, బేజారెత్తించే రొదను అరికట్టే గొప్ప గుణం వీటి కుంది. ఇటువంటి చిన్న చదరపు కాగితం ముక్కను చెవిలోకి పెట్టుకుంటే రొదగా వుండే నూలు వడికే కార్ఖానాను ఎంతో ప్రశాంతంగా చేస్తుంది. కాని ఎవరేనా మాటాడితే అది బాగా వినిపిస్తుంది.

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777

హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో






సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

ఒక క్రొత్త రకపు ఉతికే బార్‌ను సాదరము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!

shilpi hpma 6A/73 TEL

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

22-790

మన చెవులకన్నా — పాటల గోల, కార్ల హారన్‌లగోల, మోటారు సైకిళ్ల రొదా, వీటిని వినేశక్తి పరిమితంగా వుంటుంది — ఎటుపోయినా వెంటాడే వాల్‌పోస్టర్‌లు 'సెక్స్' 'సెక్స్' 'సెక్స్' బ్యానర్‌లూ కళ్లకి అయితే, చెవులకేమో యీ పాటల రొద ... అబ్బా! అబ్బా! ప గ వా డి కన్నా డా వ ద్దు రా నా య నా యీ బా ధ ... మునిసిపాలిటీవాళ్లు లైసెన్సు లిస్తారు ... పెట్టుబడిదారు పెట్టుబడి పెడతాడు

## సామాన్యుని సణుగుడు

(18వ పేజీ తరువాయి)

... బోలెడు ఖర్చవుతుంది ... ఇదంతా కాస్ట్లీ బిజినెస్ అంటున్నారా! అవును కాని మన ఆరోగ్యం మాత్రం కైంకర్యం అయిపోతూందే ...

దీ ని కో చి ట్కా వుం ది ... వీటికి పట్నంలో తిరిగేటందుకిచ్చే లైసెన్సుల రేటు కూడా చక్రవడ్డీ వేసి పెంచేయడం బాగుండదా? పోనీ యివి రోజూ ఓ గంట కన్నా ఎక్కువ తిరగకూడదు అనరాదా? బెజవాడలో ఏక్సిడెంట్ లెందుకు అవుతున్నాయీ అంటే లారీల వాళ్లంటారు ... కాని వాళ్లు యిలా వెంటపడరే ... ఆఁ ... అన్నట్లు వాళ్లకీ యీ రొద తప్పదుగా ఈ గోల తప్పుకుందికి 'రిక్షా'లో ఆఫీసుకి పారిపోదామనుకుంటూ వుంటే ... యీమాత్రం దూరానికి రిక్షానా? నడవరాదూ అని ఓ కాపిటలిస్ట్ (పెంకె) రిమార్కు.

— వీ ★ ★

## పాట్నాలో జల ప్రళయం

ఇటీవల బీహార్ రాష్ట్రం తీవ్రమైన వరదలకి గురైంది. వరద నీటితో పాట్నా నగరం అల్లకల్లోలమైంది. వరద బాధితుల సహాయార్థం సైన్యం, విమానబలం తీవ్రంగా కృషి చేశాయి పాట్నా నగరం, ఆ చుట్టుపక్కల ప్రాంతాలలోనే 200 సైనిక పడవలు ఆహారం, నీరు, మందులు, కిరోసిన్ మొదలైనవాటిని సరఫరా చేయడానికి నియోగించబడ్డాయి ప్రాణా లరచేత బట్టుకొని యిళ్ల కప్పులపై వున్నవారికి భారత విమానదళం హెలికాప్టర్‌లు ఆహారం పొట్లాలు అందజేశాయి. ఆగస్టు 28న ప్రధాని శ్రీమతి గాంధీ బీహారులో వరదకి గురైన కొన్ని ప్రాంతాలను విమానంలోనుంచి వీక్షించారు.

వరద నీటితో నిండివున్న పాట్నా నగరాన్ని, అందులోని సచివాలయ భవనాన్ని చిత్రంలో చూడవచ్చు.



...స్తే ఇంకెలా చూస్తారో తెలీదూ? నాకు ఉద్యోగమిచ్చిన వారందరూ నన్ను అదేభావంతో చూశారు. ...నసున్న మనిషిగా ఏ ఒక్కరూ చూడలేదు. తోటి ఉద్యోగుల అసభ్య ప్రవర్తన, అందుకే సభ్యత తెలియని మనుషుల మధ్య ఉద్యోగం చెయ్యడం ఇష్టం లక మానేశాను. అటువంటి ఉద్యోగాలు చెయ్యడం కంటే మిషను కుట్టుకొని స్వతంత్రంగా బ్రతకటం హాయికదూ?'' నిర్లిప్తంగా నవ్వుతూ అన్నది సీత.

క్షణకాలం జోసఫ్ మాట్లాడలేదు.

తర్వాత ''ఇంకా పెళ్లిచేసుకోలేదేం?'' అడిగాడు.

నవ్వింది సీత.

''ఎందుకు నవ్వుతావ్?''

''నేను చేసుకోక పోవటంకాదు జోసఫ్...నన్ను ఎవరూ చేసుకోలేదు. ఉద్యోగం చేసే రోజుల్లో నన్ను కట్నం లేకుండా చేసుకోటానికి చాలా మంది వచ్చారు. నేను ఉద్యోగం చేస్తున్నానుకదూ. వారంతా నా సంపాదన చూసి ఆశపడినవారే. నిజానికి వారిలో నన్ను పెళ్లి చేసుకొనే అర్హత ఎవరికీలేదు. తీరా ఉద్యోగం మానేసిన తర్వాత పెళ్లిచూపులకంటూ ఎవరూ రాలేదు. కట్నాలు కావాలికదూ. నా తర...న కట్నాలు ఇచ్చేవారు ఎవరూలేరు. అన్నయ్యలిద్దరూ వున్నా వారి బ్రతుకులు వారివి. ఈ సవతి చెల్లెలు బ్రతికి వుందన్న విషయం కూడా వారికి గుర్తుండివుండదు. ఇక నాపెళ్లికి నేనే కట్నం ఇచ్చుకోవాలి. కట్నం ఇచ్చుకునే స్తోమతు నాకులేదు. అందుకే నా పెళ్లి కాలేదు''

అతను ఏదో మాట్లాడబోయాడు. కాని ఇంతలోనే ''రా...జోసఫ్... భోజనానికి కూర్చుందాం'' అంటూ పిల్చింది సీత స్టౌమీదనించి కూరగిన్నె దించుతూ...

మాట్లాడకుండా లోపలకు నడిచాడు జోసఫ్. అతనికి కంచంలో వడ్డించి, తను విస్తరిలో వడ్డించు..., సీత...

పీటమీద కూర్చున్నాడతను.

''వంకాయకూర నీకు సయిస్తుందోలేదో'' ...వేస్తూ అన్నది సీత.

''సయిస్తుంది...వంకాయ కూరంటే నాకు చాలా యిష్టం'' అన్నాడు జోసఫ్...నిజానికి అతనికి వంకాయకూర సయించదు. సీత బాధపడుతుందేమోనని అలా అన్నాడు.

ఇద్దరూ పాత స్మృతులు గుర్తుతెచ్చుకుంటూ భోజనాలు ముగించారు.

చెయ్యికడుక్కొని ముందు గదిలోకి వచ్చాడు జోసఫ్...

పాంటుజేబులోనించి సిగరెట్‌పాకెట్‌తీసి, ఒక సిగరెట్ వెలిగించాడు.

సీత విస్తరిని మడిచి కంచంలో వుంచి పెరట్లోకి తీసుకెళ్లింది.

ఆ దృశ్యం చూసిన జోసఫ్ ''ఇప్పుడు ఏమయిందో తను క్రిస్టియన్ అనే భావం'' అనుకున్నాడు. నిజానికి ఆ దృశ్యంచూసే సీతలోవచ్చిన మార్పును తెలుసుకోగలిగాడు జోసఫ్. ఇప్పటి సీత ఇదివరకటి సీతకాదు. ఇప్పటి సీతలో ఇది వరకటి ఆశయాలు, ఆదర్శాలులేవు. కాలం సీతను ఎంతగానో



## సీత

(30వ పేజీ తరువాయి)

మార్చివేసింది. పరిస్థితులు ఆమెను క్రుంగదీశాయి. ఆ రోజుల్లో సీతకు తను అందంగా వుంటుందని, ఎవరైనా తనని చూడగానే కట్నంలేకుండా చేసుకుంటారనే ధీమా ఉండేది. తన పెళ్లిచేస్తాడనుకున్న తండ్రి సీత చదువుపూర్తి కాకముందే ఈ లోకం వదిలాడు. తండ్రి మరణంతో సీత ఆలోచనలు చెదిరి పోయాయి. తల్లికూడా పోవటంతో నిస్సహాయురాలయింది. ఒంటరిదైపోయింది. ఒంటరితనం సీతను మరింత క్రుంగదీసి వుండవచ్చు. అందుకే తన ఒంటరి బ్రతుక్కి ఏ మాత్రం తోడు దొరికినా పరవశించిపోతోంది సీత. తారతమ్యాలను మరచిపోగలుగుతోంది.

పెరట్లోనించి వచ్చిన సీత కంచాన్ని స్టాండులో పడేసి వంటిల్లు సర్దుతోంది. చివరి వరకూ కాలిన సిగరెట్ పీకను బయటకువిసిరి బూట్లు తొడుక్కున్నాడు జోసఫ్.

అయిదు నిమిషాల తర్వాత గిన్నెలనుసర్ది వంట గదిలోనించి సీత ముందుగదిలోకి రాబోతుండగా కరెంటు ఫెయిలయింది. లైట్లు పోయాయి.

అంతా చీకటి.

''జోసఫ్'' పిల్చింది సీత.

''ఊఁ'' పలికాడు జోసఫ్.

''ఎక్కడ వున్నావు ?''

''ఇక్కడే... కుర్చీదగ్గర''

నడవబోయింది సీత. దారిలో కుర్చీ తగిలింది. ముందుకు పడబోయింది అక్కడే నిల్చునివున్న జోసఫ్ మీద పడింది. అతని రెండు చేతులూ ఆమెను పట్టుకున్నాయి. అతని గుండెలమీద వాలిపోయింది సీత. అతనికి వెచ్చగావుంది సీత స్పర్శ. సీతకూ హాయిగావుంది అతని గుండెల మీద అలా వాలిపోవటం.

''జోసఫ్'' పిల్చింది సీత చిన్నగా...

''ఊఁ''

''నీకు గుర్తుందా ?'' అడిగింది సీత.

''ఏమిటి ?'' అడిగాడు జోసఫ్.

''అదే జోసఫ్... ఆ రోజు పార్కులో... నీరెండలో...నువ్వు నా చేతి వ్రేళ్లను నిమురుతూ 'నన్ను పెళ్లి చేసుకోవూ... సీతా' అని అడిగావు. అప్పుడు నేనేమన్నాను ? మన పెళ్లి ఈ జన్మలో జరగదు జోసఫ్. మన జీవితాలు సమాంతర రేఖల వంటివని అన్నాను. మన కులాలు వేరని, మతాలు వేరని ఆహారాలు వేరని అన్నాను. కాని తర్వాత తెలుసుకున్నాను జోసఫ్... ఈ కులాలూ, మతాలూ మనం సృష్టించుకున్నవని. అప్పట్లో నేను ఎంత పొరపాటు చేశానో తర్వాత అర్థమయింది. చాలా బాధపడ్డాను. అనవసరంగా ని మనస్సు గాయపరిచాను. నీ కోరికను తిరస్కరించాను. నువ్వు వెళ్లిపోయావు. నా పెళ్లి చెయ్యకముందే నాన్న ఈ లోకం వదిలాడు. తర్వాత అమ్మకూడా వెళ్లిపోయింది. ఒంటరిదాన్నయ్యాను. తోడు లేని జీవితం. ఒంటరి తనాన్ని భరించలేకుండా ఉన్నాను. ఆడది ఒంటరిగా బ్రతకటం చాలా కష్టం జోసఫ్. ఇంకా ఎన్ని రోజులు నేనిలా బ్రతకాలో వూహించుకుంటే భయంగా ఉంది. అప్పుడప్పుడు నేను ఎవరి కోసం బ్రతకాలనిపిస్తోంది? నిజం జోసఫ్... అలా అని అనిపించినప్పుడు బ్రతుకుమీద ఆశ పోతుంది. ఎంతకాలం సాగిస్తాను తోడులేని జీవనయాత్ర? నాకు తోడు కావాలి జోసఫ్... నాకు తోడుకావాలి. అందుకే నిన్ను అడుగుతున్నాను. నన్ను పెళ్లి చేసుకోవూ? నా కోరిక తీర్చవూ'' దీనంగా అన్నది సీత.

ఉలిక్కిపడ్డాడు జోసఫ్. అప్రయత్నంగా అతని చేతులు సీతను వదిలివేశాయి.

''ఏం జోసఫ్... నన్ను పెళ్లి చేసుకోవూ...'' సీత గొంతు జీరబోయింది. ఎంతో ఆత్రుతతో, భయంగా అడిగింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. జోసఫ్ తన మాటను తిరస్కరించడని కొండంత ఆశతోవుంది.

జోసఫ్ మాట్లాడలేదు.

''మాట్లాడవేం జోసఫ్... నన్ను పెళ్లిచేసుకోటం నీ కిష్టం లేదా ? అలా మౌనంగా నిల్చుంటావేం... ప్లీజ్... చెప్పు జోసఫ్...''

నిముషం తర్వాత ''క్షమించు సీతా... నీలో ఇలాంటి కోరిక వుందని నేను వూహించలేదు. నీలో ఇలాంటి మార్పు వస్తుందని ఏ మాత్రం వూహించి వున్నా ఎన్నేళ్లకైనా నీ కోసం వేచివుండేవాడిని. ఇప్పుడు నాకు ఇద్దరు పిల్లలు'' అని క్రిందికివంగి కాళ్లదగ్గరవున్న సూట్‌కేసు తీసుకొని టకటకా బూట్లు చప్పుడు చేసుకుంటూ చీకట్లో వెళ్లిపోయాడు జోసఫ్.

హతాశురాలై చీకటిగదిలో అక్కడే నిల్చుంది ఒంటరి సీత.—





శ్రీరామకృష్ణా ఆర్ట్స్

# వైకుంఠపాళి

నిర్మాత: ఎమ్. రామకృష్ణారెడ్డి B.E. దర్శకత్వం: కె. బాపయ్య

లక్ష్మీ ఫిలింస్

పాటలు: ఆత్రేయ సంగీతం: కె.వి. మహదేవన్